ఓమ్

శ్రీ మలయాళసద్గురు పరబ్రహ్మణే నమః

# సుఖము - దుఃఖము





గ్రంథకర్త

శ్రీ చిన్మయ రామదాసు

ఓమ్

శ్రీ మలయాళసద్గురు పరబ్రహ్మణే నమః

# సుఖము - దుఃఖము







గ్రంథకర్త

శ్రీ చిన్మయ రామదాసు

# విషయసూచిక



గ్రంథకర్త :

శ్రీ చిన్మయ రామదాసు



శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ గణేశాయ నమః శ్రీ శారదామాత్రే నమః

# సుఖము - దుఃఖము

## దైవప్రార్థనలు

శ్లో. న త్వహం కామయే రాజ్యం । న స్వర్గం నా పునర్భవమ్
కామయే దుఃఖతప్తానాం । ప్రాణినా మార్తినాశనమ్ ॥

తా. శ్రీహరీ! నేను రాజ్యము నిమ్మని కోరుట లేదు. స్వర్గమును కోరుట లేదు. జన్మరాహిత్యమును నేను కోరుట లేదు. ఇక నేను కోరిన దేమన దుఃఖముతో కాలుచున్న ప్రాణుల యొక్క దుఃఖమును నశింప జేయవలసినదని యే కోరుచున్నాను.

( ప్రహ్లాదుడు )

# భక్తులు భగవంతుని కోరిన వరములు

కం॥ నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార నాకు దయసేయగదే ॥

శ్లో. న ధనం న జనం న సుందరీం కవితాం వా జగదీశ కామయే
మమ జన్మని జన్మనీశ్వరే భవతాద్భక్తిర హైతుకీత్వయి॥

తా. ఓ జగదీశ్వరా! నాకు ధనము వలదు. జనము వలదు. సుందరీమణి వలదు. కవిత్వము వలదు. జన్మజన్మాంతరములందును నీయందలి అహేతుకభక్తియే నాకు వలయునది.

(శ్రీకృష్ణ చైతన్య ప్రభువు)

శ్లో. యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ
త్వాం అనుస్మరతసా మే హృదయా న్మాపసర్పతు ॥

తా. ఓ శ్రీహరీ! అవివేకులకు క్షణికములగు విషయ భోగములందు (వస్తువులందు) యెట్టి ప్రీతియుండునో, అట్టి ప్రీతి గాఢముగా నిన్ను ధ్యానించునపుడు నా హృదయము నుండి తొలగకుండునుగాక!

శ్లో. అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనమ్
దేహాంతే తవ సాయుజ్యం దేహిమే పార్వతీపతే ॥

తా. ఓ ఉమామహేశ్వరా! దారిద్ర్యబాధ లేని జీవనమును, ఆయాసము లేని మరణమును, మరణానంతరము నీయొక్క సాయుజ్య ముక్తియును నాకు దయచేయుము.

శ్లో. శివేశాన మహాదేవ
వామదేవ సదాశివ
కల్పాయు ర్దేహిమే పూర్ణం
యావ దాయు రరోగతామ్ ॥

తా. శివా! ఈశా! మహాదేవ! వామదేవా! సదాశివా! ...ల్పాంతము వరకు జీవించే పూర్ణాయువును, జీవించి యున్నంత ...కు రోగము గలుగకుండునట్లును నాకు వరము నిమ్ము.

(మార్కండేయుడు)

శ్లో. దేవ మే సర్వదా బుద్ధిః
ధర్మేతిష్ఠ మశాశ్వతే
మారోచయ త్వధర్మే మే
బుద్ధి స్సర్వత్ర సర్వదా ॥

తా. ఓ భగవంతుడా! నా బుద్ధి ఎల్లవేళలందును ...శ్వతమైన ధర్మమునందే యుండునుగాక! నా బుద్ధి అన్ని ...లముల యందును అన్ని కాలముల యందును హింస, అసత్యాది ...ధర్మముల వైపునకు పోకుండునుగాక! (విభీషణుడు)

శ్లో. జయేయం లోభ మోహాంశ్చ
క్రోధం చా హం సదా విభో
దానే తపసి సత్యేచ
మనో మే సతతం భవేత్ ॥

తా. ఓ శ్రీకృష్ణభగవంతుడా! లోభమును, మోహ...మును, క్రోధమును నేను నిగ్రహించు శక్తిగలవాడ నగుదును...గాక! నా మనస్సు ఎల్లప్పుడు తపస్సు, దానము, సత్యము...లందు ఆసక్తిగలదై స్థిరమైనది అగునుగాక!

(ధర్మరాజు)

శ్లో. శంఖ చక్ర గదా పాణే ద్వారకానిల యాచ్యుత
గోవింద పుండరీకాక్ష రక్షమాం శరణాగతమ్ ॥

తా. శంఖము, చక్రము, గదయును ధరింపబడిన చేతులుగలవాడా! ద్వారకావాసా! అచ్యుతా! గోవిందా! పుండరీకాక్షా! శరణు బొందిన భక్తుడ నగు నన్ను రక్షించుము.

శ్లో. హరే మురారే మధుకైటభారే
గోపాల గోవింద ముకుంద శౌరే
యజ్ఞేశ నారాయణ కృష్ణ విష్ణో
నిరాశ్రయం మాం జగదీశ రక్ష ॥

తా. శ్రీహరీ! మురారీ! మధుకైటభారీ! గోపాలా! గోవిందా! ముకుందా! శౌరీ! యజ్ఞేశా! నారాయణా! కృష్ణా! విష్ణూ! జగదీశా! ఆశ్రయము (దిక్కు) లేనివాడనగు నన్ను రక్షించుము.

శ్లో. భక్తబంధో దయాసింధో త్వత్పాదాబ్జే నమామ్యహం
సూక్తాసూక్త మిదం సర్వ మపరాధం క్షమస్వమే ॥

తా. భక్తబంధూ! దయాసింధూ! నీ పాదపద్మములకు నమస్కారము. తెలిసిగాని, తెలియకగాని చేసిన నాయొక్క యపరాధముల నన్నిటిని క్షమించుము.

శ్లో. శ్రీనివాస కృపాపూర్ణ భక్తపోషణ దీక్షిత
సంసారారణ్య పతితం దయయా నేక్షసే కుతః ॥

తా. శ్రీనివాసా! కృపాపూర్ణా! భక్తులను పోషించుటకు దీక్షవహించినవాడా! సంసారమనెడి అరణ్యములో దిక్కు తెలియకయున్న నన్ను దయతో చూడవేమి?

శ్లో. ప్రసీద దేవేశ జగన్నివాస
స్మృతిర్యథాస్యా త్తవపాదపద్మే
సక్తిస్సదాగచ్ఛ తుదారకోశ
పుత్రాత్మ చిహ్నేషు గుణేషు మే ప్రభో ॥

తా. ఓ దేవేశా! జగన్నివాసా! ప్రభో! గుణముల యందును, భార్య, పుత్ర, మిత్ర, ధనాది వస్తురూప నామములయందును ఆసక్తి పోవునట్లు చేయుము. నీ పాద పద్మములయందు భక్తి గలుగునట్లు చేసి నన్ను అనుగ్ర హించుము.

శ్లో. సాంబ శంభో మహాదేవ కృపాసాగర శంకర
మచ్చిత్తభ్రమరో నిత్యం తవాస్తు పదపంకజే ॥

తా. సాంబా! శంభో! మహాదేవా! కృపాసాగరా! శంకరా! ఎల్లప్పుడును నా చిత్తమనెడి తుమ్మెద నీ పాద పద్మములయందు వ్రాలియుండునుగాక!

శ్లో. సర్వదా శర్వ సర్వేశ సర్వోత్తమ మహేశ్వర
తవ నామామృతం దివ్యం జిహ్వాగ్రే మమ తిష్ఠతు ॥

తా. శర్వా! సర్వేశా! సర్వోత్తమా! మహేశ్వరా! ఎల్లప్పుడును నీయొక్క దివ్యనామము నాయొక్క జిహ్వాగ్ర మందు స్మరింప (ధ్యానింప) బడుచు నుండునుగాక!

శ్లో. కర చరణ కృతంవా కర్మ వాక్కాయజంవా
శ్రవణ నయనజంవా మానసంవాపరాధం
విహిత మవిహితంవా సర్వ మేతత్ క్షమస్వ
శివ శివ కరుణాబ్ధే శ్రీమహాదేవ శంభో ॥

తా. చేతులతోను, పాదములతోను చేయబడినవియు, వాక్కుచే, శరీరముచే సంభవించినవియు, వినుటచే, చూచుటచే గలిగినవియు, మనస్సుచే గావింపబడినవియు, తెలిసిగాని తెలియకగాని గావింపబడిన అపరాధముల నన్నిటిని శివ శివా! కరుణాసాగరా! శ్రీ మహాదేవ శంభో! క్షమింపుము.

శ్లో. లోకేశ చైతన్య మయాదిదేవ
శ్రీకాంత విష్ణో భవ దాజ్ఞయైవ
ప్రాతస్సముత్థాయ తవ ప్రియార్థం
సంసారయాత్రా మనువర్తయిష్యే॥

తా. ఓ లోకేశా! చైతన్యస్వరూపా! ఆదిదేవా! లక్ష్మీనాయకా! విష్ణూ! నీయొక్క యాజ్ఞవలన ఉదయమున లేచి నీకు ప్రియము (సంతోషము) కలుగుట కొఱకు సంసారకృత్యముల జేయుచున్నాను.

శ్లో. దేహీతి వచనం కష్టం నాస్తీతి వచనం తథా
దేహి నాస్తీతి మద్వాక్యం మాభూ జ్జన్మని జన్మని॥

తా. కృష్ణా! ఇతరుల నడుగుట కష్టము. ఇతరులు అడిగినపుడు లేదు యనుట కూడ కష్టమే. కనుక ప్రతిజన్మము నందును దేహి (ఇమ్ము), నాస్తి (లేదు) యను రెండు మాటలున్న నా వాక్కు పలుకకుండునట్లు వరమిమ్ము అని కర్ణుడు కోరెను.

శ్లో. జానామి ధర్మం నచ మే ప్రవృత్తిః
జానా మ్యధర్మం నచ మే నివృత్తిః
త్వయా హృషీకేశ హృదిస్థితేన
యథా నియుక్తోస్మి తథా కరోమి॥

తా. కృష్ణా! ధర్మమన నెట్టిదో అది నాకు తెలిసి యున్నప్పటికిన్ని దానిని నేను ఆచరణలో పెట్టజాలక పోవు చున్నాను. ఇట్లే అధర్మమెట్టిదో అదియు నాకు తెలిసి యున్నప్పటికిన్ని దానిని నేను త్యజించలేకపోవుచున్నాను. నా హృదయములో నీవుండి నన్నెట్లు నియమింతువో అట్లు నడచెదను అని దుర్యోధనుడు వేడుకొనెను.

శ్లో. విపరీతేషు కాలేషు
పరిక్షీణేషు బంధుషు
త్రాహిమాం కృపయా కృష్ణ
శరణాగతవత్సల ॥

తా. శరణాగతవత్సలుడవగు ఓ కృష్ణా! కాలపరిస్థితులు విపరీతముగా మారిపోయినపుడును, బంధువులు వినాశ మొంది నపుడును దయతో నన్ను కాపాడుము.

(భీష్ముడు)

శ్లో. నిందంతు బాంధవాస్సర్వే త్యజంతు స్త్రీ సుతాదయః
జనాహసంతు మాం దృష్ట్వా రాజానో దండయంతువా
సేవే సేవే పునస్సేవే త్వామేవ పరదేవతే
త్వత్కర్మనైవ ముంచామి మనోవాక్కాయ కర్మభిః ॥

తా. ఓ సర్వేశ్వరా! బంధువులందరును నన్ను నిందించినను సరే, పుత్రులు మిత్రులు మొదలైన వారంద రును నన్ను వదలివేసినను సరే, జనులు నన్నుచూచి ఎగతాళి చేసినను సరే, రాజు నన్ను దండించినను సరే, ఓ భగవంతుడా! నీసేవే చేసెద, నీ సేవే చేసెద, ముమ్మాటికిని, నీసేవే చేసెదను. మనోవాక్కాయములతో నీసేవను వదలి యుండను.

శ్లో. నాస్థా ధర్మేన వసు నిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపమ్
ఏ తత్ ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలా భక్తిరస్తు॥

తా. ఓ భగవంతుడా! నేను పుణ్యము నిమ్మని కోరుట లేదు. ధనముపైని ఆసక్తిలేనివాడను. కామ భోగముల యందును ప్రీతిలేదు. పూర్వకర్మానుసారముగా ఏ సమయమున (ఏయే కాలమున) ఏది సంభవింపనున్నదో అదియంతయు వచ్చుగాక! అయినను, ప్రతిజన్మమందును నీ పాదారవిందములయందు స్థిరమైన భక్తియుండునట్లు అనుగ్రహించుము. ఇదియే నా కిష్టమైన కోరిక.

శ్లో. త్వదుత్తప్తేన హే దుఃఖమయాత్మాఽన్విష్ట ఆదరాత్
తస్మాత్త్వదుపదిష్టోఽయం మార్గో మమ నమోఽస్తుతే
త్వత్ప్రసాదే నలదేయం శీతలాపదవీ మయా
దుఃఖనామ్నే దుఃఖతత్త్వ సుఖదాత్మన్నమోఽస్తుతే॥

తా. ఓ దుఃఖమా, నీచే బాధపడుచుండుట చేతనే భక్తితో పరమాత్మను వెదకితిని. పరమాత్మను భజించమని తెలిసికొనుమనియు నీవే నాకు ఉపదేశించితివి. కావున నీకు నమస్కారము. నీ కృపచేతనే శాంతమగు ఆత్మపదము నాకు లభించినది.

దుఃఖమను పేరుగల సుఖప్రదుడవగు ఓ దుఃఖతత్త్వమా, నీకు మాటికి మాటికి నమస్కారము చేయుచున్నాను.

## సృష్టి స్థితి లయము లెందు జరుగుచున్నవి?

శ్రుతి ॥ ఆనందా ద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే
ఆనందేన భూతాని జీవంతి।
ఆనందం ప్రయం త్యభి సంవిశంతి ఆనందో
బ్రహ్మేతి వ్యజానాత్ ॥

తా. ఈ చరాచర ప్రాణిసముదాయమంతయు ఆనంద స్వరూపమగు పరబ్రహ్మమునుండియే పుట్టినది. పుట్టిన ప్రాణులన్నియు ఆనందమయమగు దైవము వలననే జీవించు చున్నవి. మఱల ఈ జీవకోటులన్నియు ఆనందములోనే లయించుచున్నవి. కనుక అట్టి యానందమే బ్రహ్మమని స్వస్వరూపమని) తెలిసికొనవలెను.

భక్తులు ఈ జగమంతయు ప్రేమలోనే పుట్టి, ప్రేమలోనే బతుకుచు, చివరకు ప్రేమలోనే లయించునని చెప్పుదురు.

కర్మసిద్ధాంతులు ఈ జగత్తు కర్మనుండి పుట్టి,కర్మయందే జీవించుచు, చివరకు కర్మలోనే లయమొందునని పలుకుదురు.

## బ్రహ్మమేది? జగమేది?

శ్లో. అస్తిభాతి ప్రియం రూపం నామచే త్యంశపంచకం।
అద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయమ్॥

తా. సత్యము, జ్ఞానము, ఆనందము, బ్రహ్మ స్వరూపము, నామము, రూపము జగత్తుయొక్క రూప మనబడును. ఇవే పరబ్రహ్మముయొక్క పంచవిధ అంశములు.

## జగ మెట్లు పుట్టినది?

శ్రుతి ॥ ఆత్మనః ఆకాశ స్సంభూతః ఆకాశా ద్వాయుః।
వాయో రగ్ని రగ్నే రాపః అద్భ్యః పృథివీ॥

తా. ఆత్మనుండి ఆకాశము పుట్టినది. ఆకాశమునుండి వాయువు కలిగెను. వాయువునుండి అగ్ని జన్మించెను. అగ్ని నుండి జలము సంభవించెను. జలమునుండి భూమి ఉద్భవించెను.

శ్రుతి ॥ అజ్ఞానా దవివేకః అవివేకా దభిమానః ।
అభిమానా ద్రాగాదయః రాగాదేః కర్మాణి
కర్మణః శరీరపరిగ్రహః ॥

తా. అజ్ఞానమునుండి అవివేకము గలిగెను. అవివేకము వలన అభిమానము కలిగెను. అభిమానమునుండి రాగము, ద్వేషము, లోభము, మోహము మొదలగు గుణములు కలిగెను. రాగాది గుణములచే పుణ్యపాప మిశ్రకర్మ లేర్పడినవి. కర్మ దోషములవలన శరీరము ( జన్మ ) వచ్చినది.

## జీవులకు గల కోరిక యేది?

"సుఖం మే భూయాత్ దుఃఖం మే మాస్మభూయాత్."

తా. నాకెల్లప్పుడును సుఖమే కలుగవలెను. నాకెన్నడును దుఃఖము రాకుండును గాక యను కోరిక యుండును.

## సుఖ దుఃఖము లన నెవ్వి?

"సుఖం బ్రహ్మ జగ ద్దుఃఖ మితి వేదాంతడిండిమః"

తా. సుఖము బ్రహ్మమగును. దుఃఖము జగద్భావన యగును యని వేదాంతభేరి మ్రోగుచున్నది. ( శంకరులు )

శ్లో. సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖం ।
ఏత ద్విద్యా త్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః ॥

తా. నామరూప ప్రపంచమునకు (శబ్దస్పర్శాది విషయములకు) లోబడుటయే దుఃఖము. తాను (మనస్సు) దేనికిన్ని లోబడక స్వాత్మదృష్టితో నుండుటయే సుఖము. ఇవియే సుఖదుఃఖములయొక్క లక్షణములని తెలిసికొనవలెను.

'అనుకూల వేదనీయం సుఖం ప్రతికూల వేదనీయం దుఃఖం.''

తా. మనసాదీంద్రియములకు యిష్టమైన విషయములు లభించుటయే సుఖము. ఇష్టముకాని విషయములు ప్రాప్తించుటయే దుఃఖము. ఎట్లనగా,

చెవులద్వారా జీవునకు (మనస్సునకు) ఇష్టమైన శబ్దములు వినబడినపుడు సుఖమును, యిష్టముకాని శబ్దములు వినబడినపుడు దుఃఖమును కలుగునుగదా! ఇట్లే ఇష్టమైన వాటిని తాకుటచే సుఖము, యిష్టములేని స్పర్శలచే దుఃఖము గలుగును. ఇష్టమైన రూపములను చూచినపుడు సుఖమును, యిష్టముకాని రూపములను చూచినపుడు దుఃఖమును కలుగును. ఇష్టముగల రుచులను అనుభవించినపుడు సుఖమును, యిష్టము కాని పదార్థములను తినినపుడు దుఃఖమును కలుగును. ఇష్టమైన వాసనలను చూచినపుడు సుఖమును, యిష్టముకాని వాసనలను చూచినపుడు దుఃఖమును కలుగునుగదా!

మనము దుఃఖపడుచున్నవారిని చూచినపుడు వీరికి యేదో సుఖము (ఇష్టమైనది) పోయినదనియు, అయిష్టమైనది ప్రాప్తించినదనియు నిశ్చయించుకొనవలెను. ఇట్లే మనము సంతోషముతో (నవ్వుతో) నున్నవారిని చూచినపుడు వీరి కేదో దుఃఖము (అయిష్టమైనది) పోయినదనియును, యిష్టమైనది ప్రాప్తించినదనియును నిశ్చయించుకొనవలెను.

శ్లో. జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః ।
సంసారసాగరం దుఃఖం తస్మాజ్జాగ్రత జాగ్రత ॥

శ్లో. వాసుదేవ! జరాకష్టం కష్టం నిర్ధనజీవనం।
పుత్రశోకం మహాత్కష్టం కష్టాత్కష్టతరం క్షుధా ॥

శ్లో. ఋణం యాచ్ఞాచ వృద్ధత్వం జారచోర దరిద్రతా।
రోగశ్చ భుక్తశేష శ్చాప్యష్టకష్టాః ప్రకీర్తితాః ॥

జన్మ దుఃఖము. ముసలితనము దుఃఖము. పుత్రమిత్రాదులతో కూడిన సంసార సముద్రము నీదుట దుఃఖము. దరిద్రజీవనము దుఃఖము. బిడ్డలు పుట్టకున్నను, పుట్టినవారు పారిపోయినను, చనిపోయినను, పిచ్చివారైనను, అంగహీనులైనను దుఃఖము. ఋణములు, వ్యభిచారము, దొంగతనము, యాచనావృత్తి, రోగములు, ఇతరులు వదలిపెట్టిన ఆహారమును భుజించుటయు కష్టములగును. అన్నిటికంటె ఆకలిబాధ మిక్కిలి కష్టమైనది.

## త్రివిధ దుఃఖములు

1. ఆధ్యాత్మిక దుఃఖము : అనగా జ్వరము, తలనొప్పి, కడుపునొప్పి మొదలగు రోగములచేత, కామము, క్రోధము, భయము మొదలగు గుణములచేత గలుగు బాధలు అశాంతికరములగును.

2. ఆధిభౌతిక దుఃఖము : అనగా పులి, పాము, తేలు, దొంగలు మొదలగు ప్రాణులవలన గలుగు బాధలు.

3. ఆధిదైవిక దుఃఖము : అనగా పిడుగు, ఎండ, గాలి, వాన, చలి మొదలగు దైవసంబంధములైన బాధలు.

ప్రియమైన పుత్రమిత్రాదులు, ధనాది వస్తువులు, కీర్తి, ఆరోగ్యము, మనశ్శాంతి మొదలైనవి పోయెనుగదా యను

ఃఖము ; విరోధులు, అపకీర్తి, అనారోగ్యము, కామక్రోధ
యాదిగుణములు మొదలైనవి బాధించుచుండెనుగదా
ను దుఃఖము ; పుత్రులు, కీర్తి, ఆరోగ్యము, శమదమాది
ద్గుణములు, ఆత్మశాంతి, పరమాత్మదర్శనము మొదలైనవి
ుగలేదుగదా యను దుఃఖమును మానవులకుండునుగదా !

## సుఖదుఃఖముల స్థితిగతు లెట్లుండును ?

శ్లో. సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం।
ద్వయమేతద్ధి జంతూనా మలంఘ్యం దివరాత్రివత్ ॥

తా. రాత్రింబగళ్లలవలె సుఖము కొంతకాలముండి యి దుఃఖము వచ్చును. దుఃఖము కొంతకాలముండి గానే సుఖము వచ్చును. ఈ సుఖదుఃఖములను అతిక్రమించుటకు శరీరధారులగు ప్రాణులకు సాధ్యపడదు.

శ్లో. సుఖమధ్యే స్థితం దుఃఖం దుఃఖమధ్యే స్థితం సుఖం।
ద్వయమన్యోన్య సంయుక్తం ప్రోచ్యతే జలపంకవత్ ॥

తా. జలము, బురదయును కలిసియున్న విధముగా ుఖములో దుఃఖము కలదు. దుఃఖములో సుఖము కలదు. ఈవిధముగా సుఖదుఃఖములు అన్యోన్యముగా కలిసియుండునని నుభవజ్ఞులచే చెప్పబడినది. ( అధ్యాత్మరామాయణము )

## సుఖదుఃఖములు కలుగుటకు కారణము లెవ్వి ?

సూ॥ "తేహ్లాదపరితాపఫలాః పుణ్యాపుణ్యహేతుత్వాత్."

తా. పుణ్యముచేసియున్నవారికి సుఖము కలుగును. పాపముచేసినవారికి దుఃఖము కలుగును.

శ్లో. సుఖదుఃఖాదికం ద్వంద్వం యావత్కాలం భవేన్మనే।
తావచ్ఛుభాశుభంకర్మ బాధతే శ్రుతిశాసనాత్ ॥

శ్లో. యావత్సుఖం చ దుఃఖం చ బాధా పుణ్యేన పాపతః ।
సుఖదుఃఖ విహీనస్తు పుణ్యైః పాపైర్న బాధ్యతే ॥
శ్లో. యాదృశం క్రియతే కర్మ తాదృశం భుజ్యతే ఫలమ్ ।
యాదృశం వాప్యతే బీజం తాదృశం ప్రాప్యతే ఫలమ్॥

తా. ఎంతకాలమువరకు సుఖదుఃఖములు, స్తుతినిందలు, రాగద్వేషములు, కామక్రోధములు, ఆకలిదప్పికలు మొదలైనవి కలుగుచుండునో అంతవరకును మానవులు చేసిన పుణ్యపాపకర్మల ఫలములను అనుభవించియే తీర వలయును. ఇది వేదశాసనము.

ఎపుడు సుఖదుఃఖములు తనకు అంటవో అపుడు పుణ్యపాపకర్మలున్ను అంటవు.

మానవు డెట్టి విత్తనమును పెట్టునో అట్టి ఫలమునే పొందునట్లు, ఎట్టికర్మను చేయునో అట్టి ఫలమునే పొందును.

"అతస్సంసార విషయసంకల్పమేవ దుఃఖమ్." (శ్రుతి)

తా. సంసార (ప్రపంచ) విషయ సంకల్పము లేదుఃఖము.

"ఆశా చ పరమం దుఃఖం, నిరాశా పరమం సుఖమ్."

తా. ఆశయే పెద్ద దుఃఖము. నిరాశతోనుండుటయే శ్రేష్ఠమైన సుఖమగును.

"చిత్తసత్తాపరం దుఃఖం చిత్తాసత్తాపరం సుఖమ్."

తా. చిత్తచలనముండుట గొప్పదుఃఖము. చిత్తచలన మనునది లేకుండుటయే ఉత్కృష్టమైన (శ్రేష్ఠమైన) సుఖమగును.

శ్లో. యత్కించిదపి సంకల్ప్య నరో దుఃఖే నిమజ్జతి ।
న కించిదపి సంకల్ప్య సుఖ మవ్యయ మశ్నుతే ॥

తా. కొంచెము సంకల్పము గలిగియున్నప్పటికిని ానవులు దుఃఖములో మునుగవలసి యుందురు. కొంచెము ండ సంకల్పము కలుగని స్థితి యేర్పడినపుడే శాశ్వతమైన అక్షయమైన ) సుఖమును పొందుచున్నారు.

ప్రియతో జాయతే శోకః ప్రియతో జాయతే భయమ్ ।
ప్రియతో విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్ ॥
ప్రేమతో జాయతే శోకః ప్రేమతో జాయతే భయమ్।
ప్రేమతో విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్॥
కామతో జాయతే శోకః కామతో జాయతే భయమ్।
కామతో విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్ ॥
తృష్ణయా జాయతే శోకః తృష్ణయా జాయతే భయమ్ ।
తృష్ణయా విప్రముక్తస్య నాస్తి శోకః కుతో భయమ్ ॥

తా. ఆసక్తినుండి దుఃఖము, భయమున్ను కలుగును. పేమనుండి దుఃఖము, భయమున్ను కలుగును. కామము కోరిక ) నుండి దుఃఖము, భయమున్ను కల్గును. ఆశనుండి ుఃఖము, భయమున్ను కలుగును.

ప్రియత్వము, ప్రేమ, కామము, ఆశయు లేనిచో ుఃఖమున్ను లేదు. భయమున్ను లేను. ( ధర్మపదము )

వివరణ : సుఖమునందు ప్రీతియున్నపుడు దుఃఖము లిగినచో బాధ కలుగును. బాధలు వచ్చునేమో యను సందేహామున్నపుడు భయము కలుగును.

స్తుతింపబడుటయందు ప్రీతియున్నప్పుడు, నిందవచ్చి ప్పుడు బాధ కలుగును. నిందలు ( దూషణలు ) వచ్చు నేమోయను సందేహామున్నపుడు భయము కలుగును. ఇట్లే నమునందు ప్రీతియున్నపుడు, ధనముపోయినపుడు దుఃఖము

కలుగును. ధననష్టము కలుగునేమో యను సందేహ మున్నపుడుభయముకలుగును. ఇట్లే దేహాభిమానమున్నపుడు, దెబ్బలు తగిలినను, రోగములు వచ్చినను దుఃఖము గలుగును, దుఃఖములు వచ్చునేమో యను సందేహమున్నపుడు భయము గలుగును. ఇట్లే పుత్రమిత్రాదులయందు మమకార మున్నపుడు వారు వియోగమొందినచో దుఃఖము కలుగును. వియోగము కలుగునేమో యను సందేహమున్నపుడు భయము కలుగునుగదా!

తులసీదాసుగా రిట్లు చెప్పిరి : నేను మంచివారికిన్ని, చెడ్డవారికిన్ని నమస్కరించుచుందును. ఇరువురివలన కూడ దుఃఖము కలుగుచున్నది. ఎట్లన, మంచివారు పోయినపుడు దుఃఖము కలుగుచున్నది. చెడ్డవారు వచ్చినపుడు దుఃఖము కలుగుచున్నది. కనుక ఈ దుఃఖములు నశించుటకుగాను యిరువురకును నమస్కరించుచుందును.

శ్లో. ఆస్థామాత్ర మనంతానాం దుఃఖానా మాకరం విదుః।
అనాస్థామాత్ర మభితః సుఖానా మాకరం విదుః॥

తా. అనిత్యములైన దేహ ధనాదులను నిత్యమైన వనుకొనుటలోనే దుఃఖము కలదని తెలియవలెను. ఇట్లే అనిత్యములైన శబ్ద స్పర్శాది విషయములపైగల ఆసక్తి, మోహము నశించుటయే మహాసుఖము అనుభవించుటకు కారణమగునని తెలియవలెను.

సూ॥ "ద్రష్టృ దృశ్యయోః సంయోగో హేయహేతుః"

తా. ద్రష్ట (చూచునది), దృశ్యము (కనబడునది) ఐక్యమగుటయే దుఃఖము కలుగుటకు కారణమగుచున్నది.

వివరణ : దేవుడు వేరు, మనము వేరు అను భావ మున్నంతవరకును మనకు పరిపూర్ణసుఖము సిద్ధించదు. అజ్ఞానము ( అవివేకము ) వలన మనము స్వాత్మను మరచి మనస్సునందు పుట్టిన కామ, క్రోధ, భయ, సుఖ, దుఃఖములే స్వస్వరూపమనుకొనుటవలన జననమరణాది క్లేశములు బాధించుచున్నవి. సర్వము నాదే, నాస్వరూపమే యనుకొని నను, నాదేమియున్ను లేదు, నాకు నామరూపములు లేవు అని నిశ్చయించుకొనినను మోక్షసుఖము కలుగును.

## రాగద్వేషములు సుఖదుఃఖములు కలుగుటకు హేతువులనుట

సూ. " సుఖానుశయీ రాగః ॥ "

సూ. " దుఃఖానుశయీ ద్వేషః ॥ "

తా. సుఖము ననుసరించి రాగము ( కోరిక ) కలుగును. దుఃఖము ననుసరించి ద్వేషము కలుగును.

శ్లో. ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌవ్యవస్థితౌ ।
తయోర్నవశమాగచ్ఛేత్తౌహ్యస్యపరిపంథినౌ ॥

తా. మనకున్న ప్రతి ఇంద్రియ విషయమునందును రాగము, ద్వేషమున్ను కలవు. కనుక శాశ్వతానందము ( అక్షయసుఖము ) నొందదలంచిన ముముక్షువులు రాగ ద్వేషములకు లోబడకూడదు. వివేకజ్ఞానము, మోక్షసుఖా పేక్షయు గలవారికి రాగద్వేషములు రెండును శత్రువులు.

వివరణ : మంచిది యని ప్రేమించుట రాగ మనబడును. చెడ్డది యని నిరసనచేయుట ద్వేషమనబడును. మంచిది యనినపుడు సుఖము గలుగును. చెడ్డది యనినపుడు దుఃఖము కలుగును. అభ్యాసులు సుఖదుఃఖములకు చలించక యుండవలెను. ఆరూఢులు సుఖదుఃఖములను వర్ణించక, అంటక యుండవలెను.

ఇష్టమైన శబ్దములచే, రూపములచే, స్పర్శలచే, రుచులచే, వాసనలచే రాగము, సంతోషమును కలుగును.

ఇష్టముకాని శబ్దములచే, రూపములచే, స్పర్శలచే, రుచులచే, వాసనలచే ద్వేషము, దుఃఖమున్ను కలుగును. శారీరిక తపస్సును, వాచిక తపస్సును, మానసిక తపస్సును చేయుచు రాగద్వేషములను నశింపజేసుకొని కైవల్యసుఖమును అనుభవమునకు తెచ్చుకొనుటయే జీవితపరమావధి యగును.

శ్లో. బుద్ధవాసన మర్థోయః సేవ్యతే సుఖయత్యసౌ ।
యత్సుఖాయ తదేవాశు వస్తుదుఃఖాయ నాశతః ॥

తా. మనకు ఇష్టమైన విషయములందు గాఢమైన ప్రీతియున్నంతవరకును సుఖముగా నుండును. ఇష్టవిషయములు దూరము (నాశనము) కాగానే అధికముగా దుఃఖము కలుగును. ఇష్టమైనవి ఎన్నియుండునో అన్నిసుఖము లుండును. ఇట్లే యిష్టముకాని విషయములెన్నియుండునో అన్ని దుఃఖములు నుండును. ఇష్టానిష్టములు కూడియున్న మాయామనస్సు నశించిన ఆత్మనిష్ఠాపరులకు సుఖదుఃఖము లుండవు.

రోగశోకపరీతాపః బంధనం వ్యసనాని చ।
ఆత్మాపరాధవృక్షాణాం ఫలాన్యేతాని దేహినామ్॥

తా. జీవునకు కలిగిన రోగము, దుఃఖము, పరితాపము, సనము మొదలైన వన్నియును తానుచేసిన పాపమనెడి క్షముయొక్క ఫలము లగును.

## సుఖపెట్టువారెవరు? దుఃఖపెట్టువారెవరు?

సుఖస్య దుఃఖస్య న కోఽపిదాతా పరోదదాతీతి కుబుద్ధిరేషా।
అహంకరోమీతి వృథాఽభిమానః స్వకర్మసూత్ర గ్రథితోహి జంతుః॥

తా. సుఖమునుగాని, దుఃఖమునుగాని కలిగించు రెవరున్నులేరు. ఇతరులు సుఖదుఃఖములు కలిగించు న్నారనుకొనుట అవివేక లక్షణము. నేను సుఖపెట్టు న్నాను, నేను దుఃఖపెట్టుచున్నాను అనుట వ్యర్థమైన హంభావము. వారివారి కర్మసూత్రము ననుసరించి ాణులకు సుఖదుఃఖములు కలుగుచున్నవి.

సుఖపడే హేతువు కలిగినపుడు ఏరూపముగా ఏవిధముగా) నైనను అనుకూలములు ప్రాప్తించును. ఃఖపడే హేతువు కలిగినపుడు యేవిధముగా (ఏరూపముగా) నను ప్రతికూలములు చేకూరి పీడించుచుండును.

న పరః కురుతే పీడా న పరః కురుతేఽప్రియం।
ఆత్మైవాత్మసుఖాయస్యాత్ స్వకృతంహ్యుపభుజ్యతే॥

తా. ఇతరులెవ్వరును కీడుజేయజాలరు. పరులెన్నడును పకారమును చేయజాలరు. తనకు సుఖమును తానే

చేసికొనవలెను. తనకుతానే దుఃఖమును తెచ్చుకొనును. ప్రాణులు తాము చేసికొనిన కర్మనే అనుభవించును.

శ్లో. వనే రణే శత్రు జలాగ్ని మధ్యే మహార్ణవే పర్వతమస్తకేవా।
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా రక్షంతి పుణ్యాని
పురాకృతాని ॥

తా. పుణ్యము చేసియున్న యెడల మానవులు వనమందున్నను, యుద్ధమందున్నను, శత్రువులమధ్య జలము యొక్కయు అగ్ని యొక్కయు మధ్యమందున్నను, సముద్రమునందు పర్వతశిఖరమందున్నను, నిద్రించుచున్నను, మేలుకొనియున్నను, గొప్పయాపదయందున్నను తమ పుణ్యము తప్పక రక్షించును.

"తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ ॥

"పూర్వజన్మకృతం కర్మ దైవశబ్దేన ఈరితః"

తా. పూర్వము చేయబడిన కర్మయే సుఖదుఃఖముల గలిగించునట్టి దేవుడు అను శబ్దముచే చెప్పబడుచున్నది.

## మనస్సులోనే సుఖదుఃఖము లున్నవనుట.

శ్లో. మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః!
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥

తా. మానవులకు బంధము ( దుఃఖము ) కలుగుటకు మోక్షము ( సుఖము ) కలుగుటకును మనస్సే కారణమగును.

యములపై ఆసక్తిగల మనస్సు బంధములో నుంచును.
షయముగా నున్న మనస్సు మోక్షసుఖము నొందించును.

బంధురాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనాజితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ ॥

తా. వివేకబలముచే నిగ్రహింపబడిన మనస్సు
ధువవలె సుఖపెట్టుచుండును. స్వాధీనమందుండని మనస్సు
వువవలె దుఃఖపెట్టుచుండును. 181.48 CH1

అంతశ్శీతలతాయాంతు - లబ్ధాయాం శీతలం జగత్ ।
అంత స్తృష్ణోపతప్తానాం దావదాహామయం జగత్ ॥

తా. హృదయము ( మనస్సు ) చల్లగా, ప్రశాంతముగా
న్నచో జగమున్ను చల్లగానే కనబడును. హృదయము
ధముతో, దుఃఖముతో మండుచున్నచో జగత్తు కూడ
వాగ్నిలాగా కనబడును. ( యోగవాసిష్ఠము ) 1=75

మనస్సు స్వాధీనమైయున్నయెడల మనమెక్కడుండి
నేమి ? మన కేమి వాటిల్లిననేమి ? ( శ్రీరమణమహర్షి )

మంచిది చెడుగా కనబడుటకును, చెడు మంచిగా
బడుటకును-ఇట్లే, కష్టమైనది సుఖముగా కనపడుటకును,
ఖకరమైనది కష్టముగా కనబడుటకును మనస్సే కారణ
గును. మఱియు నిత్యమైనది అనిత్యమైనదిగా కనబడుట
ను, అనిత్యమైనది నిత్యమైనదిగ కనబడుటకును మనస్సే
రణమగును. 

కథ : ఒక ఊరిలో సకలశాస్త్రములున్ను చదివిన
ప్ప పండితుడు కలడు. ఇతని కుమారుడు కాశిలో
దువుచుండెను. ఒక మహాత్ముడు కాశికి పోవుచు పండితుని

గృహముయొక్క అరుగుపై కూర్చొనెను. అపుడు పండితుడు మహాత్మునితో సంభాషణ జరుపుచు "సుఖదుఃఖములకు కారణమేది?" యని ప్రశ్నించెను. అపుడు మహాత్ముడు "మనస్సే సుఖదుఃఖములకు కారణ" మని చెప్పెను. ఈ విషయమును అనుభవమగునట్లుగా తెలియజేయవలసినదని పండితుడు కోరెను. అపు డామహాత్ముడు "రెండు మాసములలో తెలియజేసెద"నని చెప్పి కాశికి బయలుదేరి వెళ్లెను. ఆ మహాత్ముడు కొంతకాలమునకు కాశికి చేరిన తరువాత కాశీవిశ్వవిద్యాలయములో పండితుని కుమారుని జాడ తెలిసికొని మాట్లాడి వెళ్లిన తరువాత "మీ కుమారుని చూచితిని, మాట్లాడితిని. చాల మంచివాడు. అభివృద్ధిలోనికి వచ్చినాడు" అని పండితునికి ఒక ఉత్తరమును వ్రాసెను. ఆ ఉత్తరమును పండితుడు చదివి మిక్కిలి సంతోషముతో పొంగిపోవుచు అనేకులకు కూడ ఆ ఉత్తరము చూపించెను. కొంతకాలమైన తరువాత ఆ మహాత్ముడు పండితునకు "మీ ప్రియమైన కుమారుడు ఈదినమే చనిపోయినా" డని ఉత్తరమును వ్రాసెను. ఆ ఉత్తరమును చూచుకొని అంతులేని దుఃఖములో మునిగిపోయి వెంటనే దుఃఖముతోనే కాశికి ప్రయాణమై వెళ్లిచూడగా తన కుమారుడు సురక్షితముగానే యుండెను. సంతోషముతో పండితుడు మహాత్ముని కలిసికొని "ఓ సన్న్యాసీ! నన్ను అబద్ధపు ఉత్తరమనెడి దుఃఖాగ్ని గుండములో పడద్రోసి బాధపెట్టించితివిగదా" యనెను. "ఏమి, చిన్న కాగితపుముక్కే నీకు దుఃఖము కలిగించినదా? మొదట వ్రాసిన ఉత్తరము సంతోషములో ముంచినదిగదా! ఇపుడు నీకు సుఖము దుఃఖమున్ను మనస్సు

...నే కలవను విషయము బోధపడినదిగదా" యని ...హాత్ముడు ప్రశ్నలవేయగా పండితుడు "ఇపుడు నిజము ...ధపడిన" దని చెప్పెను.

## కష్టములచే గల్గు లాభములు, కష్టములచే గల్గు నష్టములు

శ్లో. విత్తనాశాపవాదశ్చ వియోగస్సహ బాంధవైః ॥
దేశత్యాగో మహావ్యాధిః మద్భక్తే పంచలక్షణమ్ ॥

తా. 1) ధనము నశించుట 2) నిందలు వచ్చుట ...) బంధుమిత్రాదులతో గల సంబంధము తెగిపోవుట 4) తన ...ప దేశమును వదలివేయుట 5) మహావ్యాధి సంభవించుటయు ...ను — ఈ ఐదున్ను కలుగుట నాభక్తులైనవారికి లక్షణములు ...అని భాగవతమునందు విష్ణుభగవానుడు చెప్పెను.

"విపదస్సంతు నశ్శశ్వాత్ యాసుసంకీర్త్యతేహరిః"

తా. ఓకృష్ణా! మాకెల్లప్పుడును కష్టములే కలుగు... గాక! ఎందుకనగా కష్టములు కలిగినప్పుడు మాత్రమే నిన్ను గుర్తునకు తెచ్చుకొని స్మరించుచు ఆనందమును అనుభవి... గలుగుచున్నాము అని కుంతీదేవి వేడుకొనెను.

దేహాభిమానమున్నంతవఱకును కష్టసుఖములు వచ్చుచునే యుండును. దేహాభిమానము పోవుచున్నకొలది సత్యధర్మములపై దృష్టి నిలచును. ధనము వలన, పుత్రమిత్రాదుల వలన, దేహాసంబంధమైన వ్యాధుల వలన కష్టములు వచ్చుచున్నయెడల ధనముపై, పుత్రమిత్రాదులపై, దేహముపై గల అభిమానమున్ను మమకారమున్ను నశించుచుండును.

కష్టములు మనకు అనేక నీతి ధర్మములను తెలియ జేయుచుండును. పూర్వము చేసిన పాపములే బయటకు వచ్చినపుడు కష్టములనబడుచున్నవి. ఇతరమానవాది జీవులను మనోవాక్కాయములతో బాధపెట్టించినచో యితరుల పాపమును మనము లాగుకొనినట్లగును. ఇట్లే ఇతరులు మనలను ఏరూపముగానైనను బాధలుపెట్టిన యెడల మన పాపమును ఇతరులు లాగుకొనినట్లగును. ఎన్ని కష్టములువచ్చి పైబడి నలుగద్రొక్కినను హరిశ్చంద్రుని వలె, ప్రహ్లాదునివలె, పాండవులవలె చలించక పరమాత్మ ధ్యానమును, నీతిధర్మములను తప్పక నడచుచున్నచో తప్పక మనకు మోక్షసుఖము చేకూరునను విషయమును ఎన్నడును మరువ కూడదు.

కథ : ఒక ఊరిలో వివేకవంతుడగు ధనవంతుడు కలడు. అతనికి చెప్పిన పనికినీ మాటకును వ్యతిరేకముగా నడచునట్టి సేవకుడు కలడు. ఇతరులు ధనవంతుని దగ్గరకు వచ్చి "దుర్మార్గుడైన ఈ సేవకుని వెళ్లగొట్టి మంచి సేవకుని పెట్టుకొను" డని పదేపదే గట్టిగా చెప్పిరి. అపుడు ఆ ధనికుడు ఇట్లు చెప్పెను. "సోదరులారా! నేను ఇదివరకు పెట్టుకొనిన సేవకులకంటె నితడు చాలమంచివాడు. ఇతని వలన నేనెంతో బాగుపడుచుంటిని. ఇతని వలన నాలో అహంకారము, క్రోధము, సహనము, మమకారము ఎంత ఉన్నవో తెలియుచున్నది. ఇతనివలన సర్వ భూతములలోను గల పరమాత్మస్వరూపజ్ఞానము గుర్తులో నుంటున్నది. కనుక యితడే నాకు ఉండదగినవాడు" డని

్రను. ఈకథవలన కష్టములో లాభము కలదని
ఓకొనవలెను.

ఇపుడు కష్టములచే గలుగు నష్టముల గురించి చెప్ప
ను. కష్టములకు చలించని వివేకసంపన్నులకు మాత్రము
ము లేమియు కలుగవు.

" మానం కులం కల్వి వన్నై అరిఉడమైదానం
తవము యర్చితాళాన్ మైతేనిన్ కసివందు
పోల్లియర్ మేల్ కాముఱనల్ పత్తుం
పసివందిడ పరంతుపోమ్ " ( మళయాళము )

తా. (1) మానము (2) కులము (3) గౌరవము
వివేకము (5) దానము (6) తపఃప్రభావము
సహానము (8) మధురవాక్యము (9) విద్య (10) కరుణా
కూడిన మాటలున్ను అగు-ఈ పది సద్గుణసంపత్తియును
్కలి ఆకలి బాధించునపుడు పారిపోవును.

ఒకప్పుడు విశ్వామిత్రుడు ఆకలిబాధకోర్వజాలక
ండాలుని గృహమందు కుక్కమాంసమును దొంగిలించి
ననని భారతము శాంతిపర్వమందు కలదు.

ఒకప్పుడు వేదవ్యాసులవారు కాశిలో ఆకలి బాధచేత
్వనాథుని దూషించెను.

లోకములో అనేకులు ఆకలిబాధకు తాళజాలకయు,
్వాచాపల్యమునకు లోబడియు హింస, దొంగతనము
ద్ధములాడుట, మోసగించుట మొదలగు చెడ్డపనుల
యుచున్నారుగదా! ధర్మము తప్పనివారికి, భగవంతుని
మ్మయున్నవారికి, కష్టములు వచ్చినను సులభముగా
టిపోవు భాగ్యము తప్పక కలుగును.

శ్లో. త్యజశోకం మహాభాగ ! శోకస్సర్వ వినాశనః ।
శోకోదహతిగాత్రాణి బుద్ధిశ్శోకేన నశ్యతి॥

శ్లో. లజ్జాధృతిశ్చ ధర్మశ్చ శ్రీః కీర్తిశ్చస్మృతిర్నయః ।
త్యజంతి సర్వధర్మాశ్చ శోకేనోపహతం నరం॥

తా. ఓ భాగ్యవంతుడా ! దుఃఖమును వదలిపెట్టుము. దుఃఖము అన్నిటిని నాశము చేయును. దుఃఖము దేహమును కాల్చివేయును. దుఃఖము వివేచనాశక్తిగల బుద్ధిని నశింప జేయును. దుఃఖముచే కొట్టబడిన మానవుని లజ్జ, ధైర్యము, ధర్మము, ఐశ్వర్యము, కీర్తి, జ్ఞాపకశక్తి, సదాచారము మొదలగునవి వదలిపోవుచున్నవి. అనగా దుఃఖములకు చలించిన ( భయపడిన ) మానవులలో మంచి భావములున్ను. సద్గుణములున్ను సత్ప్రవర్తనలున్ను నిలిచియుండవని తాత్పర్యము. ( వరాహ పురాణము )

మానవు లొకప్పుడు సుఖములు పోవునేమోయని భయముచెంది బాధపడెదరు. ఇంకొకతరి దుఃఖములు వచ్చునేమోయని బాధపడెదరు. మరొకప్పుడు వచ్చిన కష్టములు నశించక బాధించుచున్నవే భగవంతుడా యని దుఃఖపడుచుందురు. అనేకులు కష్టములను సహించలేక అనేక తప్పులనుచేసి పాపదోషములను సంపాదించుకొనుచున్నారు. ఇది గొప్ప తప్పు. పాతపాపదోషములవలన ఎన్ని కష్టనష్టములు వచ్చినను క్రొత్త పాపములనుచేయక ఓర్పుతోను, విశ్వాసముతోను ధర్మమును, దైవమును, ఆశ్రయించి యుండుట మానవధర్మమగును. కష్టములకు చలించనివారే దేహ ( లోక ) దృష్టిని దాటి దైవమును పొందుదురు.

## సుఖదుఃఖముల నివారణోపాయము

శ్లో. పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణబాధతే ।
తచ్ఛాంతిరౌషధందాన జపహోమ సురార్చనైః

తా. పూర్వముచేసిన పాపదోషములు శరీరవ్యాధుల రూపముగాను మానసికవ్యాధుల రూపముగాను వచ్చి బాధలు పెట్టుచుండును. ఆ బాధలను ఔషధములచేతను, దానధర్మములచేతను, భగవన్నామ సంకీర్తన జపధ్యానముల చేతను, శివ, రామ, కృష్ణ, శ్రీవేంకటేశ్వర, పాండురంగాది దేవతలను పూజించుటచేతను పోగొట్టుకొనవలెను, పోవును కూడ.

శ్లో. భోగే రోగభయం కులేచ్యుతి భయం
విత్తేనృపాలాద్భయం ।
మానేదైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా
భయం॥
శాస్త్రే వాదభయం గుణే ఖలభయం
కాయే కృతాంతాద్భయం !
సర్వం వస్తుభయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవా
భయమ్ ॥

తా. భోగము లనుభవించునపుడు రోగములు వచ్చునేమో యను భయ ముండును. మంచి కులములో పుట్టినపుడు దాని విలువ నశించునేమో యను భీతియుండును. ధనమున్నపుడు రాజులుగాని, దొంగలుగాని తీసికొనిపోవుదురేమో యను భయము కలుగును. అభిమానమున్నపుడు దీనత్వము కలుగునేమో యను భయముండును. బలమున్నపుడు శత్రుభయముండును. అందమున్నపుడు ముసలి

తనము వచ్చి అందమును పోగొట్టునేమో యను భయ ముండును. పాండిత్యమున్నపుడు వాదించి బాధపెట్టువారు వచ్చెదరేమో యను భయముండును. గుణమున్నపుడు దుష్టులు హేళనచేయుదురేమో యను భయముండును. శరీరమున్నపుడు చావు వచ్చునేమో యను భయముండును. ఈవిధముగా సర్వనామరూప విషయములున్న భయరూప మైన దుఃఖము గలిగియుండును. ఈ దుఃఖము లన్నియు వైరాగ్యముతోనే నశించును. ఒక్క వైరాగ్యమే భయ రహితమైనది.

శ్లో. విప్రయోగేన తుత్యాగే దోషదర్శీ సమాగమే ।
విరాగం భజతే జంతు ర్నిర్వైరో నిరవగ్రహః ॥

తా. మానవులు పోయిన వాటిని త్యాగబుద్ధితో మరచుచు, లభించినవాటిని దోషదృష్టితో గాంచుచు నున్నచో, సుఖదుఃఖరహితులై వైరాగ్యమును పొంది ఆనందముగా నుండగలుగుదురు. అనగా పోయినవి మఱల రావనియు, వచ్చినవి ఎప్పటికైనను నాశనము నొందితీరు వనియు నిశ్చయముతో నున్నవారికి సుఖదుఃఖము లుండవు.

## ఉత్తమ, మధ్యమ, అధమ సుఖములు

శ్లో. యత్తదగ్రేవిషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్॥

శ్లో. విషయేంద్రియ సంయోగాద్యత్తదగ్రేఽ
మృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసంస్మృతమ్ ॥

శ్లో. యదగ్రేచానుబంధేచ సుఖం మోహన మాత్మనః ।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్॥

తా. ఏ సుఖము ముందుగా విషముగా కనపడి క్రమ క్రమముగా అమృతముగా మారునో, మఱియు పరమాత్మ దర్శనము కలిగించుటకు బుద్ధిని నిర్మలము చేయునో ఆ సుఖమే ఉత్తమసుఖము ( సాత్త్విక సుఖము ) అనబడును.

ఇంద్రియ విషయసుఖములు ముందుగా అమృతము వలె కనబడి క్రమక్రమముగా విషమువలె మార్పుజెందును. కనుక రాజస సుఖమనబడును.

నిద్ర, ఆలస్యము, ప్రమాదము, చెడువృత్తులచేతను కలిగి మొదటను చివరను సుఖముగా నున్నట్లు జీవుని భ్రమింపజేసి మోసగించునది తామససుఖమని చెప్పబడును.

తామసులు చెడుపనులలో సుఖము కలదని తలంచి చెడుపనులనే చేయుచుందురు. మఱియు గడచినకాలమున అనుభవించిన సుఖములను గుర్తునకు తెచ్చుకొని పొగడుకొను చుందురు.

రాజసులు విషయభోగములే నిత్యమైనవిగ నిశ్చయించుకొని యెంత శ్రమ, యెంతఖర్చుయైనను వర్తమాన కాలమున సుఖములనుభవించుటకు సదా పాటుపడుచుందురు. సాత్త్వికులు సత్యధర్మపరమాత్మస్మరణాది ప్రవర్తనలోనే శాశ్వత సౌఖ్యముకలదని నిశ్చయించుకొని వర్తమాన కాలములో శ్రమలను, ఖర్చులను లెక్క-చేయక వైరాగ్యముతో నుందురు.

నిర్గుణారాధనపరులు సదా నిర్వికల్ప సుఖమును, నిరాకార నిర్వికార పరబ్రహ్మ స్వరూపమును ధ్యానించుచు బ్రహ్మానందముతో నుందురు.

ఈశరీరములో సుఖ దుఃఖములను అనుభవించే
"శోకమోహౌతు మానసౌ."
తా. ఇష్టమైనవాటిపై మోహము కలిగియుండు
అయిష్టమైనవి లభించి నపుడు దుఃఖపడుటయును
యొక్క ధర్మములు అని ఉపనిషత్తు చెప్పు
కనుక ఈశరీరములో సుఖదుఃఖములను పొందునది
యని గ్రహించవలెను.
"మన ఏవ జీవః"
తా. మనస్సే జీవుడు అని యోగవాశిష్ఠము
చున్నది.
"ఆశాపాశస్థితో జీవః పాశముక్తస్సదాశివః
తా. ఆశలనెడి త్రాళ్ళచే (గొలుసుచే)
యున్నంతవఱకును జీవుడనబడును. ఆ యాశాపాశ
విడివడినపుడు శివుడని పిలువబడును. (మైత్రేయ్యుప
"పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ
తా. సుఖదుఃఖములను అనుభవించువాడు పు
(జీవుడు) అని చెప్పబడును. (గీత)
"బోధాభాసో బుద్ధిగతః కర్తాస్యాత్ పుణ్యపా
స ఏవ సంసరేత్ కర్మవశాల్లోకద్వయే సద
బోధాభాసాత్ శుద్ధబోధం వివిచ్యాదతి యత్న
తా. బుద్ధియందున్న ఆత్మయొక్క ఆ
(ప్రతిబింబమే) పుణ్యపాపములకు కర్తయనబడును.
భాసయే (జీవుడే) కర్మవశమున రెండులోకములకు
నరకములకు) పోవుచుండును. మోక్షసుఖము నొంద
వారు ప్రయత్నముతో బుద్ధిదోషమనెడి ఉపాధిని

ధ్యానములచే దొలగించుకొని పరిశుద్ధమైన పరబ్రహ్మాను-
భవము నొందవలెను .( శంకరులు )

శ్లో. నిష్కలం నిర్మలం శాంతం సర్వాతీతం నిరామయం ।
తదేవ జీవరూపేణ పుణ్యపాప ఫలైర్వృతమ్ ॥

తా. కళంకములేనిది, నిర్మలమైనది, శాంతస్వరూప
మైనది, సమస్తమునకును సాక్షియైనది, బాధారహిత
మైనదియు నగు ఆ పరమాత్మయే జీవరూపముగా పుణ్య
పాపములచేత ఆవరింపబడినది. ( యోగతత్త్వోపనిషత్తు )

## ఈ జగము జ్ఞాని కెట్లు కనబడును ? అజ్ఞాని కెట్లు కనబడును ?

శ్లో. అజ్ఞస్యదుఃఖౌఘ మయం జ్ఞస్యానందమయం జగత్ ।
అంధం భువనమంధస్య ప్రకాశంతు సుచక్షుషః ॥

తా. ఈ జగము గ్రుడ్డివానికి చీకటిగాను, నేత్రములు
గలవానికి ప్రకాశవంతముగాను కనబడుచుండునట్లు, అజ్ఞా
ఈ జగము దుఃఖమయముగను, జ్ఞానికి జగము బ్రహ్మ
మయముగను కనబడును. ( యోగవాశి

శ్లో. సంపూర్ణం జగదేవనందనవనం
సర్వేఽపి కల్పద్రుమ
గాంగంవారి సమస్తవారినివహాః
పుణ్యాః సమస్తాః క్రి
వాచః ప్రాకృత సంస్కృతాః
శ్రుతిగిరో వారాణసీ
సర్వావస్థితిరస్య వస్తువిషయాదృష్టే పరబ్రహ్మ

తా. జ్ఞానికి ఈజగమంతయు ఆనందనిలయ న
ఇంద్రుని నందనవనంవలె కనబడును. ఈజగమంది ల
వృక్షములన్నియు కల్పవృక్షములవలె కనబడును. భూ పై
గల అన్నిరకముల నీళ్లును పావనమైన గంగాజలమ లె
కనబడును. లోకములోగల అన్నిరకముల పను న్న
పుణ్యకర్మలుగా కనుపించును. చెడుమాటలున్నా, చి
మాటలున్న వేదశబ్దములుగా వినబడును. భూమియం ము
పవిత్రమైన కాశీక్షేత్రమువలె గోచరించును. ఇట్టి మహ ని
పరీతిగా నుండినను సర్వదా పరబ్రహ్మమునందే వె ము
చుండును. (శంకరాచార్యులు)

శ్లో. య దేవగోష్పదాకారం జ్ఞధియః పేలవం జగత్ ।
తదేవాపార పర్యంతమగాధమమహాత్మనః ॥

తా. జ్ఞానియొక్క బుద్ధికి ఏజగము ఆవు గు
మాత్రమై స్వల్పముగా గనబడుచున్నదో ఆ జగమే అ నికి
అంతములేనిదై దుస్తరముగా కనబడుచున్నది.

(యోగవాసిష్ఠ ం)

శ్లో. సదాతిష్ఠతిగంభీరో జ్ఞానీ కేవలమాత్మని।
నాసత్యం చింతయేద్విశ్వం నవాస్వస్యతదన్యత

తా. జ్ఞాని యాత్మయందే గంభీరుడై ఎల్లప్ప ను
నిలకడజెందియుండును. ఈజగము అసత్యమని తలం డు.
మఱియు తనను ప్రపంచముకంటె వేరనియు తల డు
(రమణగీత)

శ్లో. బ్రహ్మచిద్బ్రహ్మభువనం బ్రహ్మ భూత పరం ా ।
బ్రహ్మాహం బ్రహ్మ మచ్ఛత్రుః
బ్రహ్మ మన్మిత్ర బాంధ ః ॥

తా. చిత్తు (తెలివి) బ్రహ్మమే. ఈ జగము బ్రహ్మమే. ప్రాణి సమూహ మంతయు బ్రహ్మమే. నేను బ్రహ్మమే. నా శత్రువు బ్రహ్మమే. నా మిత్రులున్ను, బంధువులున్న బ్రహ్మమే యగుదురు. (యోగవాసిష్ఠము)

## జ్ఞానికి దుఃఖముండదా ?

శ్లో. స్వకర్మపాశవశగః ప్రాజ్ఞోఽన్యోవాజనో ధ్రువమ్ ।
ప్రాజ్ఞస్సుఖం నయేత్కాలం ఇతివేదాంత డిండిమః ॥

తా. జ్ఞానియైనను, అజ్ఞానియైనను నిశ్చయముగా ప్రారబ్ధ మనెడు కర్మపాశమునకు వశమయ్యే యున్నారు. ఐనను జ్ఞాని కాలమంతయు సుఖముగా గడుపును. (శంకరులు)

ఎండలో పెట్టబడిన దీపపు కాంతి కనబడని విధముగా జ్ఞాని దృష్టికి సుఖ దుఃఖాది ద్వంద్వములు విశేషముగా కనుపించవు. చీకటిలో పెట్టబడిన దీపపు ప్రకాశము స్పష్టముగా కనబడుచుండునట్లు అజ్ఞాని దృష్టికి సుఖ దుఃఖాది ద్వంద్వములు విశేషముగా గోచరించి చలింపజేయుచుండును.

(శ్రీమలయాళసద్గురువు)

శ్లో. న సుఖాని న దుఃఖాని న మిత్రాణి నబాంధవాః ।
న జీవితం న మరణం బంధాయజ్ఞస్య చేతసః ॥

తా. సుఖములుగాని, దుఃఖములుగాని, మిత్రులుగాని, బంధువులుగాని, బ్రతుకుగాని, మరణముగాని పరబ్రహ్మతత్త్వమును తెలిసికొనిన మహాత్ముని మనస్సునకు బంధము గలిగింపవు. (యోగవాశిష్ఠము)

" తరతిశోకమాత్మవిత్. "

తా. ఆత్మజ్ఞాని దుఃఖమును దాటిపోవును.

(3)

చేతితో జలాశయములో కలబెట్టిన ఒక్కక్షణ అలలు యేర్పడి ఉత్తరక్షణములో మహాజలముతో మెుందునట్లు మోక్షధర్మ ప్రచారకులైన మహాత్ములు దుఃఖ స్తుతి నిందాదులకు ఒక్కక్షణము చలించినను వె అఖండాత్మదృష్టితో విరాజిల్లు చుందురు. లోకమును జ్ఞాని యుండడు. లోకమునకు జ్ఞాని అంటడు.

( శ్రీమలయాళసద్గుర )

ఏదైన పురుగు కుట్టితే అజ్ఞానికివలెనే జ్ఞానికి కూడ ఉండవచ్చును. కాని దానిలో తేడా ఉన్నది. అజ్ఞాని దేః తాననుకొనును. జ్ఞాని సర్వమూ ఆత్మమయమని సర్వమూ బ్రహ్మమయమని తెలిసికొని ఉండును. బాధ ఉండుగాక. అదికూడ ఆత్మలో భాగమే. ఆత్మ పరిపూ అని భావించును.

అనారోగ్యము నీ ధ్యానానికి అవరోధమౌతు భావిస్తున్నావు. ఈ వైక్లబ్యానికి మూలము దేహాత్మ అనారోగ్యము ఆత్మకు లేదు. అది శరీరానికి. కాని శ తాను అనారోగ్యముగా ఉన్నానని చెప్పదు. నీవు చున్నావు. ఎందువల్ల? శరీరమే నీవని, శరీరములో లే తాదాత్మ్యమును కల్పించుకున్నందువల్ల శరీరము కూడ భావనే. నీ వాస్తవ స్వరూపములో నీవు ఉం వైక్లబ్యము పొందవలసిన పనిలేదు. ( శ్రీరమణభగ )

శ్లో. శోక హర్ష భయ క్రోధ లోభ మోహ స్పృహాద
అహంకారస్యదృశ్యంతే జన్మమృత్యుశ్చనాత్మ ||

తా. దుఃఖము, సంతోషము, భయము, క్రోధము, మోహము, ఇచ్ఛ మొదలగు గుణములు పుట్టుక మరణ మున్ను అహంకారమునకే కనబడుచున్నవి. ఆత్మకు పై జెప్పిన వెవ్వియున్ను లేవు.

వేదాంతులలో అనేకులు సుఖ దుఃఖములకు చలించుట వలననే, ఆత్మను మరచిపోవుచున్నారు. భక్తులలో అనేకులు సుఖ దుఃఖములకు చలించుటవలననే భగవంతుని మరచు చున్నారు. కర్మయోగులం దనేకులు సుఖ దుఃఖములకు చలించుటచేతనే పాపకర్మలకు లోబడుచున్నారు. కాన యీ సుఖ దుఃఖములు మనః కల్పితములేగాని ఆత్మధర్మ ములు కావు.

## బంధము - మోక్షము

1. మూ. అనాద్యవిద్యావాసనయాజాతో౽
హమిత్యాది సంకల్పో బంధః.

తా. అనాదియగు అజ్ఞాన (కర్మ) వాసన వలన నేను జన్మించితి ననుకొనుట బంధము.

2. పితృ మాతృ సహోదరా౽పత్య గృహారామ క్షేత్రాది
మమతా సంసారావరణ సంకల్పో బంధః.

తా. తల్లిదండ్రులు, సోదరులు, భార్యాబిడ్డలు, గృహము, ధనము, భూములు, తోటలు, నావారు, నావి అను సంసార సంకల్పము బంధము.

3. కర్తృత్వాద్యహంకార సంకల్పో బంధః.

తా. 'నేను చేయుచున్నాను' అను అహంకారరూప సంకల్పము బంధము.

4. అణిమాద్యష్టైశ్వర్యాశాసిద్ధ సంకల్పో బంధః.

తా. అణిమాది అష్టసిద్ధులపై, మహిమలపై లభి
వలెనను ఆశ నుంచుట బంధము.

5. దేవమనుష్యాద్యుపాసనా కామసంకల్పో బంధః

తా. దేవతలను, మానవులను సేవించవలెన
సంకలమున్ను బంధమే.

6. యమాద్యష్టాంగయోగాభ్యాసాది సంకల్పో బం

తా. యమ నియమాది ఎనిమిది అంగము
ఆచరించవలెనను సంకల్పము బంధము.

7. వర్ణాశ్రమ ధర్మ కర్మ సంకల్పో బంధః.

తా. వర్ణమునకు, ఆశ్రమమునకు విధించిన ధర్మ
లను, క్రియలను అనుష్ఠించవలెనను సంకల్పము బంధము.

8. ఆజ్ఞా భయ సంశయాత్మగుణ సంకల్పో బంధః

తా. ఆజ్ఞ, భయము, సంశయమున్ను ఆత్మకుగల
కొనుట బంధము.

9. యజ్ఞ వ్రత తపో దాన విధి విధాన
జ్ఞానసంకల్పో బం

తా. యజ్ఞము, వ్రతము, తపస్సు, దా
చేయుట మన జీవితధర్మమనుకొనుట బంధము.

10. కేవల మోక్షాపేక్షా సంకల్పో బంధః.

తా. కేవలము మోక్షము నొందవలెనను సం
మున్ను బంధమే.

11. సంకల్పమాత్ర సంభవో బంధః.

తా. (ఆత్మ నిర్వికల్పస్వరూపమగుటచే) సంకల్పము పుట్టుటయే బంధము.

మన నిజస్వరూపమగు సచ్చిదానందాత్మ నిరాకారము, నిర్గుణము నగును.

### మోక్షధర్మక్రమము

మూ. నిత్యకర్మానుష్ఠానాత్ ధర్మోత్పత్తిః,
ధర్మోత్పత్తేః పాపహానిః,
తతశ్చిత్తశుద్ధిః, తతస్సంసారయాథాత్మ్యావబోధః, తతో
వైరాగ్యం, తతో ముముక్షుత్వం,
తతస్తదుపాయపర్యేషణం,
తతస్సర్వకర్మ తత్సాధన సంన్యాసః,
తతో యోగాభ్యాసః,
తతశ్చిత్తస్య ప్రత్యక్ప్రవణతా,
తతస్తత్త్వమస్యాది వాక్యార్థ
పరిజ్ఞానం, తతోఽవిద్యోచ్ఛేదః, తతః స్వాత్మన్యేవావ
స్థానమ్॥
(నైష్కర్మ్యసిద్ధి)

తా. నిత్య నైమిత్తిక పుణ్యకర్మలను నిష్కామముగా చేయుచుండగా పాపమును నశింపజేయునట్టి ధర్మగుణము కలుగును. ధర్మాచరణచే పాపములు నశించును. పాపనాశనముచే మనస్సు (హృదయము) శుద్ధమగును. మనశ్శుద్ధిచే సంసారము అనిత్యమైనదనియు, దుఃఖకారణమగుననియు బోధపడును. ఈ వివేకజ్ఞానము వలన అనిత్యవిషయములపై గల ఆసక్తి నశించును. ఈ వైరాగ్యముచే మోక్షాపేక్ష

కలుగును. ముముక్షుత్వముచే మోక్షసాధనలను గురి
ఉపాయము నన్వేషించును. మోక్షసాధన విచార
సమస్తకర్మలను, కర్మసాధనలను వదలిపెట్టవలెననునిశ్చం
కలుగును. కర్మసన్యాసానంతరము చిత్తనిరోధరూప క
మును చేయును. ఈ యోగముచే వెలుపలి నామరూప
వలన గల్గు సుఖముపై విరక్తి జనించి లోపల నున్న
సుఖముపై దృష్టి నిలచును. ఈ యాత్మ నిలకడచే 'అ
బ్రహ్మాఽస్మి' యను అనుభవజ్ఞానము కల్గును. ఈ యను
జ్ఞానముచే అవిద్య (అజ్ఞానము) పూర్తిగా నశించ
ఈ యజ్ఞాన నాశనముచే పరిపూర్ణదృష్టితో పరబ్రహ్మ
స్వరూపులై యెల్లప్పుడు నుండ గల్గుదురు. ఇదియే కైవల్య

శ్లో. ద్వేపదేబంధమోక్షాయ, మమేతి నిర్మమేతి చ ।
మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి చ ముచ్యతే

తా. బంధము యొక్కయు, మోక్షము యొక్క
సారము రెండు పదములలో కలదు. 'నాది' యనుకొను
బంధము. 'నాది కాదు' అని స్వాత్మదృష్టితో నుండు
మోక్షము అని చెప్పబడును. (ఉత్త

శ్లో. ముక్తిం దదాతి వైరాగ్యం, రాగోయచ్ఛతి బంధ
మతం వై సర్వశాస్త్రాణాం, యథేచ్ఛసి తథా కుర

తా. నామరూప క్రియలపై గల ఆసక్తియే బంధ
వాటిపై ఆసక్తి లేకుండుటయే మోక్షము. ఇదే
శాస్త్రములలోని సారమగును. తరువాత నీ యిష్ట మెట్లున
యట్లు నడుచు కొనుము. (అష్టావక్ర

శ్లో. తదాబద్ధోయదాజీవో కించిద్వాంఛతిశోచతి।
తదా మోక్షో యదా చిత్తే, న శోచతి న కాంక్షతి॥

తా. ఎపుడు జీవుడు కొంచెమైనను కోరిక గలవాడగునో, అపుడు బద్ధుడై దుఃఖితు డగును. ఎపుడు చిత్తము కోరికను, దుఃఖమును లేకయుండునో అపుడు మోక్షసుఖము నొందినట్లగును.

( హఠయోగ ప్రదీపిక )

శ్లో. అజడం వేదనం సుప్తం మోక్ష ఇత్యభిధీయతే।
ప్రబుద్ధం బంధ ఇత్యాహుర్యదిచ్ఛసి తదాహర॥

తా. రామా! జగత్తుయొక్క నామరూపరహితమగు చైతన్య స్థితియే మోక్ష మనియును, నామరూపములతో కూడిన దృశ్య స్థితియే బంధ మనియును చెప్పబడును. ఈ రెంటిలో నీ కేది యిష్టమో దానిని అభ్యసింపుము.

శ్లో॥ సంవిదుద్బోధనేబంధస్తదనుద్బోధనే శివమ్।
అసత్సద్వజ్జగద్భాతి సంవిదుద్బోధనోదయమ్॥

తా. చిత్తవృత్తిని బహిర్ముఖ మొనర్చుటయే బంధము. ధ్యాన సమాధులచే ఆ చిత్తమును ఆత్మయందు లీన మొనర్చుటయే మోక్షము, చిత్తవృత్తిని బహిర్ముఖ మొనర్చుట చేతనే అసత్తగు ఈ జగత్తు సత్యముగ తోచుచున్నది.

శ్లో॥ సుఖ దుఃఖ కలాస్పందో బంధో జీవస్య నేతరః।
తదభావోహి మోక్షస్స్యాదితి ద్వేధా వ్యవస్థితిః॥

తా. జీవునకు సుఖ దుఃఖములు స్ఫురించుచుండుటయే బంధము. వీటికంటె వేరుగా బంధ మనునది లేదు. సుఖ దుఃఖములు గోచరించకుండుటయే కైవల్యము (మోక్షమ) అని చెప్పబడుచున్నది. ( జ్ఞానవాసిష్ఠ

"అపేక్షైవ మనో బంధః ఉపేక్షైవ విముక్తతా

తా. అపేక్షలతో కూడిన మనస్సే బంధ
ఉపేక్షతో కూడిన మనస్సే (మనస్సులో అపేక్షలు ఏవి
లేకుండుటయే) మోక్షము.

శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్ష
బంధాయ విషయాసక్తం ముక్త్యైనిర్విషయం స్మృత

తా. మానవులకు గల్గు బంధమోక్షములకు మ
కారణమనబడును. శబ్దాది ప్రపంచ విషయముల పై ఆసక్తి
మనస్సు బంధములో (దుఃఖములో) ముంచును.
యందును ఆసక్తి నుంచని మనస్సు మోక్షమును (శాశ
నందమును) గలిగించును.

శ్లో॥ చిత్తేచలతి సంసారో నిశ్చలే మోక్ష ఉచ్యతే ।
తస్మాచ్చిత్తం స్థిరం కుర్యాత్ ప్రజ్ఞయా పరయా బు

తా. చిత్తము చంచలముగా నుండుటయే సంసా
(బంధము). చిత్తము నిశ్చలముగా నుండుటయే మోక్ష
కనుక ప్రజ్ఞాశీలుడగు మానవుడు అక్షయ సుఖము నొంద
గాను, అభ్యాస వైరాగ్యాది సాధనలతో చిత్తమును సా
పరచుకొనవలెను.

"యత్రాస్తి భోగో న చ తత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో న చ తత్ర భోగః॥"

తా. ఎచట భోగ వాంఛలు కలవో, అచట మో
ఖము ఉండదు. ఎచట మోక్ష సుఖము (ఆత్మసుఖ
లదో అచట భోగ వాంఛలు నివసించవు.

"పురుషస్య కర్తృత్వ భోక్తృత్వ సుఖ దుఃఖాది
లక్షణః చిత్త
ధర్మః క్లేశరూపత్వాద్బంధో భవతి ; తన్నిరోధనం
జీవన్ముక్తిః"
(ముక్తికోపనిషత్తు)

తా. మానవులయందు గల కర్తృత్వమును (నేను చేయుచున్నాను అను భావము), భోక్తృత్వము (నేను అనుభవించుచున్నాను అను భావము), సుఖ దుఃఖ లాభ హాన్యాది వికారములును చిత్తముయొక్క ధర్మములనబడును. ఇవి క్లేశకారణములగుటచేత ఇవే మానవులకు బంధమగును.

ఈ క్లేశ నివృత్తియే జీవన్ముక్తి యగును.

శ్లో. యథా సునిపుణస్సమ్యక్పరదోషేక్షణేరతః ।
తథా చేన్నిపుణస్స్వేషు కోనముచ్యేత బంధనాత్ ॥

తా. పరుల తప్పులను వెదకుటయందు తనకు మంచి నేర్పరితనము ఉన్నవిధముగా ఎవరి తప్పులను వారే వెదకుకొని సవరణ జేసికొనుచున్నచో ముక్తి నొందక యెవరుందురు ? బంధవిముక్తులగుదు రనుట.

శ్లో. పృథివ్యాం యాంతి భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్ ।
జిహ్వోపస్థ పరిత్యాగే కోనముచ్యేత బంధనాత్ ॥

తా. లోకములోగల ప్రాణులు జిహ్వాచాపల్యమునకును, గుహ్యేంద్రియ చాపల్యమునకును కట్టుబడియున్నవి. రుచులపైగల ప్రీతిని, కామసుఖముపైగల ఆసక్తిని పరిత్యాగము చేసినచో బంధము నుండి (దుఃఖము నుండి) విముక్తి నొందక యెవరుందురు ?

శ్లో. ఆదరేణ యథా స్తౌతి ధనవంతం ధనేచ్ఛయా।
తథా చేద్విశ్వకర్తారం కోనముచ్యేత బంధనాత్॥

తా. ఏవిధముగా ధనముపైగల యిచ్ఛచేత ధనవంతుని ఆదరముతో స్తుతించునో ఆవిధముగానే విశ్వనాథుడగు భగవంతునిపై భక్తినుంచి మరువకయున్నచో బంధమునుండి విముక్తినొందక యెవరుందురు?

శ్లో. సమాసక్తం యథా చిత్తం జంతోర్విషయ గోచరే।
యద్యేవం బ్రహ్మణి స్యాద్యోకోనముచ్యేతబంధనాత్॥

తా. ప్రాణుల చిత్తము విషయసుఖములందెట్లు ఆసక్తి గలిగి యుండునో, అట్లే పరమాత్మయందును ఆసక్తి గలిగి యున్నచో సంసారబంధమునుండి విముక్తినొంద కెవరుందురు?

శ్లో. న మోక్షో నభసః పృష్ఠే పాతాళే న చ భూతలే।
తృష్ణా నాశేన మనసః శాంతిర్మోక్ష ఇతి స్మృతః॥

తా. మోక్షమనునది పైన ఆకాశమున లేదు. క్రింద పాతాళమున లేదు. మనస్సునందున్న సమస్త కోరికలును నశించి ప్రశాంతి నొందుటయే మోక్షమని చెప్పబడును

"భూమో జన్మాద్య ప్రసక్తిర్విముక్తిః
క్లేశ క్షత్యాభాతి జన్మాద్యభావః
క్లేశ క్షత్యాః హేతురాత్మైక నిష్ఠా
తస్మాత్కార్యాహ్యాత్మనిష్ఠా ముముక్షోః"

తా. పునర్జన్మరహితావస్థయే ముక్తి యనబడును. ఆ జన్మ రాహిత్యము (ముక్తి) దుఃఖములు నశించినప్పుడు కలుగును. ఆ దుఃఖములు పరమాత్మనిష్ఠ చేసిన మాత్రమే నశించును. అందువలన మోక్షము నొందగోరువారు ఆత్మ స్వరూపమును ధ్యానించుచుండ వలెను. (శంకరాచార్యుల

శ్లో. క్లేశాస్స్యుర్వాసనా ఏవ జన్తోర్జన్మాది కారణం ।
జ్ఞాన నిష్ఠాగ్నినాదాహే తాసాం నో జన్మహేతుతా॥

తా. దుఃఖములనగా ప్రపంచవాసనలే యగును. అవియే ప్రాణులయొక్క జన్మాది దుఃఖములకు కారణము లగును. వానిని ( ఆవాసనలను ) జ్ఞాననిష్ఠ యను అగ్నిచే గాల్చగా వానికి జన్మహేతుత్వముండదు.

"భోగేచ్ఛా మాత్రకోబంధ స్తత్త్యాగో మోక్ష ఉచ్యతే"

తా. శబ్ద స్పర్శాది విషయసుఖములపై గల ఇచ్ఛయే బంధము. ఆ ఇచ్ఛను త్యజించుటయే మోక్షము.

( మహోపనిషత్తు )

అర్జునుడు 'మొదట నారాజ్యము పోయెనుగదా' యని దుఃఖపడినాడు. రెండవ పర్యాయము తన రాజ్యమును కాజేసిన శత్రుపక్షము వారిపైగల మమకార మోహముల వలన వారిని నేను చంపలేనని రథముపై నీరసముపుట్టిన మానవునివలె చతికిలపడి దుఃఖపడినాడు. శత్రువులను చంపనిదే రాజ్యము లభించదుగదా! దీనిని గురించి భగవంతుని దగ్గర ఏడ్చుచు మొరపెట్టుకొనినాడు. అప్పుడు భగవంతుడు "నీవు క్షత్రియుడవగుటచేత యుద్ధము చేయక తప్పదనియు, దేహములు నశించినను ఆత్మమాత్రము నశించనది కాదనియు, నేను నీ శత్రువులయొక్క సూక్ష్మదేహము లను చంపివేసితిని. కావున నీవు నిమిత్తమాత్రముగానుం యుద్ధము చేయుము" అని చెప్పి చివరకు అర్జునునిచే యుద్ధమ చేయించి శత్రువులను ఓడింపజేసి రాజ్యము నిప్పించి అర్జును కీర్తివంతునిగా, సుఖవంతునిగా జేసెను.

(అంతరార్థం) ఇట్లే మనముకూడ అజ్ఞానగుణము
వలన గోల్పోయిన ఆత్మరాజ్యమును, శాశ్వతానందమును
అక్షయకీర్తిని పొందలేక పోవుచున్నాముగదా అని దుఃఖ
పడుచున్నాము. ఇది మొదటి దుఃఖము.

రెండవ దుఃఖమేమనగా - ఆత్మసుఖమును, శాశ్వ
కీర్తిని పొందనీయక జేయుచున్న దేహ, ధనాదివస్తువులపైగ
మమకారమును, బంధుమిత్ర పుత్రాదులపైగల వ్యామోహ
మును వదలిపెట్టలేక దుఃఖపడుచున్నాము. మమకారమ
లున్ను వ్యామోహములున్ను నశించనిదే ఆత్మసామ్రాజ్యమ
లభించదుగదా !

మోక్షసుఖము నొందుటకుగాను, అజ్ఞానగుణముల
నశించుటకుగాను ఎల్లప్పుడున్ను దుఃఖపడుచు దేవునిదగ్గ
మొరపెట్టుకొనుచున్నచో ఆ భగవంతునికి మనపై కృ
కలిగి గురువులద్వారాగాని, అంతరాత్మద్వారాగాని మనక
జ్ఞాన (మోక్ష) ధర్మములను తెలియజేసి మనలోగ
అజ్ఞానగుణముల శక్తిని సగము ఆ భగవంతుడే నశింపజే
నిమిత్తమాత్రముగా మనచేత తపస్సును చేయించి చివర
మానసాదింద్రియములను గుణములను స్వాధీనము గావింపజే
స్వస్వరూపాత్మ సుఖమును పెంపొందింపజేయును. శాశ్వ
కీర్తిని లోకములో నుండునట్లు చేయును. జీవితముల
నింతకంటె మహాభాగ్యమేమియున్ను లేదు.

లోకములో పాపాత్ములు దుఃఖపడుదురు, పుణ్యాత్మ
లున్ను దుఃఖపడుచునే యుందురు. పాపము, పుణ్యమును
ప్రకృతిలో జేరినవే. అశాశ్వతమైనవే యగును. శిరస్సు

మట్టిగడ్డను పెట్టుకొనినను, బంగారమును పెట్టుకొనినను బరువుగానే యున్నట్లు పాపము పుణ్యముకూడ దుఃఖమునే కలిగించును.

మనోవాక్కాయములతో పాపకార్యములను చేయుట వలన దుఃఖములు వచ్చుననియును, పుణ్యకార్యములను చేయుటవలన సుఖములు కలుగుననియును సామాన్యముగా శాస్త్రములు చెప్పుచున్నవి. పాపమువలన అవివేకము కలుగును. పుణ్యమువలన వివేచనాజ్ఞానము కలుగును.

పాపఫలమున్నంతవరకే పాపము దుఃఖపెట్టును. పుణ్యమన్ననో ఆత్మసాక్షాత్కారము కలుగువరకును క్లేశము కలిగించుచునే యుండును. కనుక పాపమువలన గలుగు దుఃఖము కంటె పుణ్యమువలన కలుగు క్లేశమే ఎక్కువకాలముండును. అందువల్లనే

"సర్వం పరవశం దుఃఖమ్" అనియు "దుఃఖమేవ సర్వం వివేకినః" అనియును శాస్త్రములు చెప్పుటకు కారణమైనది.

పాపాత్ములకు కలిగిన దుఃఖము నరకమునకు, అజ్ఞానమునకు దారితీయును. పుణ్యాత్ములకు కలిగిన దుఃఖము మోక్షమునకు ఆత్మజ్ఞానమునకు దారితీయును. ఇపుడు పుణ్యాత్ములకు కలిగిన దుఃఖమునకే విషాదయోగమని తెలియవలెను.

శ్లో. జాతస్యహిధ్రువోమృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మాదపరిహార్యేఽర్థే నత్వంశోచితుమర్హసి ॥ గీత

శ్లో. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ తత్రకా పరిదేవనా ॥ గీ

పుట్టినదానికి చావును, చచ్చినదానికి పుట్టుకయు
నిశ్చయమై యున్నవి. ఈ జననమరణములనుండి తప్పిం
టకు వీలులేదుగదా! అందువలన నీవు దుఃఖపడుట తగద
పుట్టకముందును, చచ్చినతరువాతను కనబడుటలేద
మధ్యలో మాత్రము సినిమాబొమ్మలులాగా కనబడుచున్న
కనుక దేహధనాదులకు దుఃఖపడుటెందుకు? అయితే దే
దుఃఖపడవలెను?

(1) ఓ మానవుడా! దేహసుఖము కలుగలేదే య
దుఃఖపడకుము. దైవసుఖము కలుగలేదే యని దుఃఖపడువ

(2) బొంబాయి, మద్రాసు, కాశ్మీరు, కా
రామేశ్వరాదిప్రపంచమును చూడకపోతిమిగదా య
దుఃఖపడకుము. అనిత్యమైన ప్రపంచభ్రాంతులు నశించ
దేమిరా యని దుఃఖపడుము.

(3) ఇతరులు నాకు ధనాదివస్తువులను (ఆస్తి
ఇవ్వలేదే యని దుఃఖపడకుము. ఇతరులకు ధనాదివస్తువు
దానముచేయు భాగ్యము, బుద్ధియు నాకు గలుగలేదేమి
యని దుఃఖించుము.

(4) ఇతరులు నాకు సేవచేయలేదుగదా
దుఃఖించకుము. ఇతరులకు నేను సేవచేయు భాగ్య
కలుగలేదుగదా యని దుఃఖపడుము.

(5) ఇతరులు నన్ను కొట్టినారనియు, దూషిం
రనియు, తిట్టినారనియు దుఃఖపడకుము. అనిత్యమైన

మును ఇతరులు కొట్టినను, తిట్టినను, దూషించినను చలించని స్థితి, ఓర్పును కలుగలేదేమిరా యని దుఃఖించుము.

(6) రోగాది కష్టములు ధనాది నష్టములున్ను కలిగినపుడు దుఃఖింపకుము. అనిత్యములైన దేహ ధనాదులపై గల మమకారము వలన నిత్యస్వరూపుడైన భగవంతుని మరచిపోవుచున్నానుగదా యని దుఃఖపడుము.

(7) దేహమునకు అలంకారములు చేయుటకు దుస్తులు లేవుగదా యని దుఃఖపడకుము. మనోవాక్కాయములలో సద్గుణములు, సత్ప్రవర్తనలు అనెడి నిజమైన అలంకారములు లభించలేదుగదా యని దుఃఖించుము.

(8) చదువు (పాండిత్యము) లేదుగదా యని దుఃఖించకుము. భగవంతునియొక్క దివ్యనామము ఎల్లప్పుడును చదువక, గురువు చెప్పిన ధర్మములను ఎల్లప్పుడున్ను స్మరణచేసి ఆచరించక చెడిపోవుచున్నానుగదా యని దుఃఖపడుము.

(9) కష్టములు నివర్తించలేదుగదా యని దుఃఖపడకుము. దుఃఖములను హరింపజేసెడి భగవంతుని గురువును మరచిపోవుచున్నానుగదా యని దుఃఖించుము.

(10) ఇతరులు నాకు నమస్కారములు చేయుటలేదే, నన్ను కీర్తించుటలేదే, ఉన్నతస్థానమందు నన్ను కూర్చొనబెట్టలేదే యని విచారపడకుము. నేను అహంకారమును భేదబుద్ధిని నశింపజేసికొని ఇతరులకు నమస్కారములు, స్తోత్రములను చేయలేక పోవుచున్నానుగదా యని దుఃఖించుము.

(11) నేను గ్రంథములను వ్రాసి ఉపన్యాసము లిచ్చి గొప్ప కీర్తిని సంపాదించుకొనకపోతినిగదా యని

విచారపడకుము. ఇతరులు చెప్పిన ఉపన్యాసములలోని ధ
జ్ఞానములను, ఇతరులు వ్రాసిన గ్రంథములలోని సత్యధర్మా
లను తప్పక నడిచెడి శక్తి నాకు లభించ లేదుగదా యని శోక
చేయుము.

(12) ఎంతకాలము గడిచినను 'నా ధనము, నా కీ
పెరగలేదే' యని విచారపడకుము. ఎంతకాలము గడిచిన
'నాలోనున్న కామ క్రోధాది గుణములు, అజ్ఞాన భ్రాంతుల
పాపములు నశించి సద్గుణములును, జ్ఞాననిష్ఠయును, నిష్కా
పుణ్యమును వృద్ధికాలేదే' యని ఏడ్చుచుండుము.

(13) 'నేను ముసలివాడనైపోతినే. నేను తక్కు
జాతిలో పుట్టితినే, నేను స్త్రీనైపోతినే' యని దుఃఖపడకుమ
కుల గోత్రాలులేని పరబ్రహ్మమే నేను అను అఖండ జ్ఞానా
భవము కలుగలేదే యని దుఃఖపడుము.

పామర జనులకంటె అనేకరెట్లు కష్టములను మ
త్ములు అనుభవించినారు.

సత్యధర్మములను వదలని పట్టుదలయు, మనోవాక
యములను కష్టములున్ను గొప్ప పుణ్యాత్ములకు మాత్ర
లభించును.

వృద్ధి క్షయములతోనే వృద్ధి నొందవలెనని (
వివేకానందస్వాములవారు సెలవిచ్చిరి.

## జగమంతా మనస్సా ? బ్రహ్మమా ?

మాయా సంకల్ప భ్రాంతు లున్నంత వరకును
మంతా మనస్సేయగును. ఆ మాయామనోభ్రాంతులన్నియు
నశించిన తరువాత జగమంతా బ్రహ్మముగానే గోచ

చును. అప్పుడు శోక మోహాది ద్వంద్వము లేమియున్న
కనుపించవు.

శ్లో. సర్వభూత స్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥
(గీత అ॥ 6.)

మనస్సును నిగ్రహించిన మహాత్ముడు సమస్త భూత
ములలోను ఆత్మనే గాంచును. సమస్త భూతములను తన్నుగానే చూచును. ఇట్టి సమత్వదృష్టిగల పుణ్యాత్ములు
మిక్కిలి అరుదుగానే యుందురు.

కుండలన్నియును మట్టిగాను, నగలన్నియును బంగారము గాను నున్నట్లు నిజముగా జగమంతయున్న ఒక్క
బ్రహ్మమే యగును. అజ్ఞాన మనెడి స్వప్నములో నున్నంత
వరకును జగత్తు నానా విధములుగా కనబడు చుండును.

ఎంత గొప్ప పండితులైనను, ఉపన్యాసకులైనను రాగ
ద్వేషాది గుణములున్న, సుఖ దుఃఖ భయాది వికారము
లున్న ఉన్నంత వరకును వారు స్వప్నములో నున్నవారే
యగుదురు.

స్త్రీ పురుషాది భేదములున్న, సుఖ దుఃఖాది వికార
ములున్న, కామ క్రోధ లోభ మోహాది గుణములున్న
మనస్సుయొక్క భేదములే యగును.

మనస్సును నశింప జేసికొనినవారే (మనస్సును
దాటినవారే) మహాత్ములు, సుఖవంతులు, బ్రహ్మ
జ్ఞాన సంపన్నులు నగుదురు. మనస్సును దాటని వారందరికిన్ని
దుఃఖములున్న, రాగ ద్వేషములున్న రాక తప్పవు.

మనోవికార గుణములకు లోబడక ( చలించక
ఆత్మానాత్మ విచారణను వదలక నిరంతరమును పరమాత్
చింతన, సంకీర్తనలను చేయుచున్న వారు మాత్రమే క్ర
క్రమముగా మనస్సును దాటిపోవుచు (ప్రపంచదృష్టి
దూరమగుచు) పరబ్రహ్మసాన్నిధ్యమునకు చేరగల్గుదురు.

నిత్యానిత్యవస్తు విచారణతోను, దైవచింతనతో
యుండని వారెవ్వరున్ను మాయా మనస్సును దాట జాలర
గుణములకు, వస్తువులకు, మనుష్యులకు, కీర్తిప్రతిష్ఠలకు కట్టు
బడియున్న వారెవ్వరున్ను పరమాత్మ సుఖమును అనుభవిం-
జాలరు. ప్రపంచమును, దేహసుఖమును విదిలించిపార వేసి
వారే పరమాత్మాకాశమున విహరించ గల్గుదురు.

గొప్ప వివేకముగల వారిని కూడా మాయా మనసు
అనేకపర్యాయములు మోసగించు చుండును. ఒకప్పుడు సు
ములో ముంచుటకు ప్రయత్నించు చుండును. మరొకప్పు
దుఃఖములో ముంచుటకు ప్రయత్నించు చుండును. ఇ
మాయను పరమాత్మను సహాయముగా జేసికొని నశింపజేం
వలెను. అప్పుడే జీవితము ధన్యత నొందినట్లగును.

గన్నేరు, మర్రి మొదలైన పాలుగల చెట్లకు కత్తిత
గంటు పెట్టినచో పాలు కారును. నారింజ, నిమ్మ మొదలై
పాలులేని చెట్లకు గంటు పెట్టినను పాలురావు గదా! పా
వచ్చుటయు, పాలు రాకుండుటయు గంటు పెట్టుట, గం
పెట్టకుండుటలో లేదు. అది చెట్లలో గల భేదమేగదా
ఇట్లే స్త్రీ ధనాది రూపములు కనబడుట, స్తుతి నిందా
శబ్దములు వినబడుట జ్ఞానులకును, అజ్ఞానులకు

సమానముగానే యున్నప్పటికిన్ని మాయ నశించిన జ్ఞానులు నిర్వికారముగా నుందురు. మాయతో కూడియున్న అజ్ఞానులు పలువిధములుగా వికారముల జెందుదురు. దీని వలన మాయలోనే, అజ్ఞానములోనే సుఖ దుఃఖాదులు గలవనియును, మాయ నశించిన ఆత్మకు ఈ సుఖ దుఃఖాదు లేవియు లేవనియును తెలియుచున్నది గదా! ఇట్లే

దేశ కాలములలోను సుఖదుఃఖాదులు లేవు. ఒక దేశములో కొందరకు సుఖముగా నుండును. మరికొందరకు కష్టముగా నుండును. ఒక కాలము కొందరకు సుఖముగా నుండును. మరికొందరకు క్లేశకరముగా నుండును. ఇది కూడ వారి వారి హృదయము ననుసరించియే యుండునని గ్రహించవలెను. బాహ్య ప్రపంచములో సుఖ దుఃఖములు గలవని తలంచక మన హృదయములోనే సుఖ దుఃఖములు గలవని గ్రహించవలెను.

నాలుకను బట్టి రుచులలో భేదములు కనుపించును. హృదయమును బట్టి ప్రపంచము కనుపించును. కర్మను బట్టి కష్ట సుఖములు, లాభనష్టములు, స్తుతి నిందలు, గౌరవా గౌరవములున్ను కలుగును.

## మంచివా రెవరు?

ప్రశ్న : లోకములో మంచివా రెవరు?

ఉత్త : అందరూ మంచివారే.

ప్రశ్న : లోకములో చెడ్డవారు లేరా?

ఉత్త : అజ్ఞానుల దృష్టికి చెడ్డవారు కలరే గాని

జ్ఞానుల దృష్టికి సర్వమూ పరమాత్మయే. కాన సర్వ
మంచే గాని చెడు లేదు.

ప్రశ్న : మేలుచేయువారు మంచివారనియును, చేయువారు చెడ్డవారనియును చెప్పుచుందురు గదా ?

ఉత్త : మేలు (సేవ) చేయుచుండువారు పుణ్యముగ కొనెదరు. కీడు (అపకారము) చేయుచుండువారు పాపః తీసికొనెదరు. కనుక మేలుచేయువారున్ను, కీడుచేయువార మంచివారే యగుదురు. మంచి చెడ్డలే శాశ్వతమైన మాత్మ సుఖమును పొందనీయక అడ్డము వచ్చుచుః మంచి చెడ్డలు లేనిదే అఖండ ఆత్మజ్ఞాన మగును. ః చెడ్డలను విమర్శించునది ఖండజ్ఞాన మగును.

ప్రశ్న : దుఃఖములు (బాధలు) కలుగుటకు కారః లెవ్వి ?

ఉత్త : ఈశ్వర సృష్టిని ఈశ్వరునిదిగా తలం తనదిగా తలంచుట దుఃఖము గలుగుటకు మొదటి క మగును. సృష్టిని (సంసారమును) ఉపయోగించు విధానము తెలియక వర్తించుట రెండవ దుఃఖక మగును. అధికముగా ప్రేమచూపుటయు, అధికముగా ద్వేః చూపుటయు మూడవ దుఃఖకారణ మగును. స్మ పరమాత్మ మయముగా గాంచకుండుట నాల్గవ దుఃఖక మగును.

సృష్టి (సంసారము) మనలను ప్రేమించమని 7 ద్వేషించమని గాని చెప్పుటలేదు.

ప్రేమ చూపి సృష్టి (సంసారము) సుఖకరమైః తలంచుచున్నాము. ద్వేషము చూపి (భయపడి) ః

దుఃఖమయమని తలంచుచున్నాము. ప్రేమ చూపుటయును, ద్వేషము చూపుటయును మనస్సులోగల భ్రమరూపములైన వికారములే యగును. ఆత్మ ఎల్లవేళలందును నిర్వికారముగ, ఆనందమయముగనే యున్నది.

## దుఃఖము కలుగుటకు కారణము లెవ్వి ?

పాపము, కోరికలు దుఃఖము కలుగుటకు కారణములగును.

ప్రశ్న : సుఖమెందులో గలదు ? దుఃఖమెందులో గలదు ?

ఉత్త : ఆత్మకు ఇష్టములైన ధర్మములలో సుఖము కలదు. ఇంద్రియములకు ఇష్టములైన విషయములలో దుఃఖము కలదు.

ప్రశ్న : ఆత్మకు ఇష్టములైన ధర్మములెవ్వి ? ఇంద్రియములకు ఇష్టములైన విషయము (గుణము) లెవ్వి ?

ఉత్త : నిష్కామము ఆత్మకు ఇష్టము. కామము ఇంద్రియములకు ఇష్టము. శాంతము ఆత్మకు ఇష్టము, క్రోధము ఇంద్రియములకు ఇష్టము, నిరాశ ఆత్మకు ఇష్టము. ఆశ ( లోభగుణము ) ఇంద్రియములకు ఇష్టము. నిర్మమత్వము ఆత్మకు ఇష్టము. మమకారము ఇంద్రియములకు ఇష్టము. అభేద దృష్టి ఆత్మకు ఇష్టము. భేద దృష్టి ఇంద్రియములకు ఇష్టము. నిర్వికారత్వము ఆత్మకు ఇష్టము. వికారములు పొందుట ఇంద్రియములకు ఇష్టము. అంతర్ముఖ దృష్టి ఆత్మకు ఇష్టము. బహిర్ముఖ దృష్టి ఇంద్రియములకు ఇష్టమగును.

ఇంద్రియ ప్రపంచమును దాటనంతవరకును అఖండా సామ్రాజ్య సుఖము లభించదు.

మంచిపనులతోను, మంచి గుణములతోను జీవించు మంచి భావనలతో మరణించుము అని శాస్త్రము చె చున్నది.

మహాత్ములకు కూడ బాధలు వచ్చుటకు కారణములెవ్వి

కొందరకు శాపముల వలన బాధలు గలుగుచున్న కొందరకు భక్తులు, శిష్యులు నమస్కారము, సేవలు చే చుండుట వలన వారి పాపము గురువులకు సంక్రమించు అందువలన బాధలు వచ్చుచుండును.

కొందరు మహాత్ములు భక్తులకు వచ్చిన రోగము దయతో తీసికొని అనుభవించు చుందురు.

పూర్వము చేయబడిన పాపము వలన కొందరకు బ వచ్చుచుండును.

శ్రీ బుద్ధభగవానుడు శిష్యుల పాపములు సం మించుట వలన వాతపు నొప్పులతో బాధలు పడెను.

శ్రీ క్రీస్తు భగవానుడు భక్తుల పాపములను స్వీకరి శిలువపై బాధలు పడెను.

శ్రీ రామకృష్ణపరమహంస ఇంటి దగ్గర నున్న ఫ అన్నగారు జబ్బులో నుండి దాహమగుచున్నపుడు నీ త్రాగుచుండగా త్రాగనీయక గ్లాసును తీసికొని నపుడు "! గొంతుక బాధతో క్లేశము నొందెదవుగాక" యని శ మిచ్చెను. అందువలన గొంతుకలో కురుపు లేచి బ పెట్టెను.

భక్తుల రోగములను అప్పుడప్పుడు తీసికొని శ్రీ రామకృష్ణపరమహంస అనుభవించెను. భక్తులు, శిష్యులు తాకుట వలన, నమస్కరించుట వలన, సేవచేయుట వలన వారి పాపములు సూక్ష్మ శరీరముపై పుండ్లు పుండ్లుగా కనబడె ననియు శ్రీ రామకృష్ణపరమహంస చెప్పెను.

శ్రీ గాంధీమహాత్ముడు గోవును చంపించుట వలన తుపాకిగుండు తగిలి మరణించెనని కొందరు భావించిరి.

శ్రీ మలయాళస్వాములవారు, శ్రీ శివానందస్వాములవారు, శ్రీ రమణమహర్షి, శ్రీ అరవిందయోగి మొదలగు మహాత్ములు శిష్యుల పాపములను గ్రహించి, అనుభవించి నిర్యాణము నొందిరి.

## అజ్ఞాన సుఖములో గల దుఃఖము

ప్రశ్న : అజ్ఞాన మనసేమి ?

ఉత్త : నిత్యస్వరూపమైన ఆత్మను తెలియనీయక చేయునదియు, అనిత్యములైన లోకము యొక్క, శరీరము యొక్క, మనస్సుల యొక్క అనిత్యత్వమును తెలియనీయక చేయునదియును అజ్ఞానమగును. ఈ అజ్ఞానమున కేమనస్సనియు, సంకల్పమనియు, మోహమనియు, బంధమనియు, పాప (మల) మనియు, అనర్థమనియు, మాయయనియు, తమస్సనియు పేరులు చెప్పుదురు.

ప్రశ్న : దుఃఖ మెందులో కలదు ?

ఉత్త : అజ్ఞానముతో కూడిన సుఖములోనే కలదు.

ప్రశ్న : నా ఈ శరీరములో సుఖముగా నుంటున్నాను గదా, శరీరము వలన గలిగే దుఃఖమేది ?

ఉత్త: శరీరమునకు దోమలు, తేలు కుట్టినను, కురుః లేచినను, జ్వరాది వ్యాధులు వచ్చినను, ముండ్లు గ్రు కొనినను, దెబ్బలు తగిలినను దుఃఖము కలుగును గదా

ప్రశ్న : నా తల్లిదండ్రులు నన్ను సుఖముగా పోషి చున్నారు గదా! వారి వలన నాకు దుఃఖమేమి గలదు

ఉత్త : నీ తల్లిదండ్రులకు వ్యాధులు వచ్చినప్పు మరణము సంభవించినప్పుడు నీకు దుఃఖము కలుగును గ

ప్రశ్న : నా భార్యతో నేను సుఖముగా నుంటున్నా ఆమె వలన నాకేమి దుఃఖము గలదు ?

ఉత్త : చెప్పినట్లు భార్య చేయనప్పుడు, భా రోగాది బాధలు వచ్చినప్పుడు, భార్య చనిపోయినప్పుడు దుఃఖము కలుగును గదా! కనుక సుఖములో దుఃఖ కలదని గుర్తించుము. ఇట్లే భర్తవలన భార్యకున్ను దుఃఖ కలుగును.

ప్రశ్న : మా గృహములో నేను సుఖముగా ను న్నాను గదా! గృహము వలన నాకు దుఃఖమెట్లు కలుగు

ఉత్త : నీగృహము గాలి వానలకు పడిపోయిన అగ్నిచే దహనమైనను నీకు దుఃఖము కలుగును గదా! క సుఖములో దుఃఖము గలదని తెలియుము.

ప్రశ్న : నేను ధనముతో సుఖముగా నుంటున్నా గదా! నాకు ధనమువలన దుఃఖమెట్లు కలుగును ?

ఉత్త : నీ ధనమును ఇతరులు తీసికొని ఇవ్వనపుడున్ను, జేబులో డబ్బులు పోయినపుడున దొంగలు కాజేసినపుడున్ను, అగ్నిచే దహించినపుడున

రోగాది ఆపదలచే క్షీణించు అగునప్పుడున్ను దుఃఖము కలుగును గదా!

ప్రశ్న : బిడ్డలతో నేను సుఖముగా నుంటున్నాను, బిడ్డలవలన నాకు దుఃఖమెట్లు కలుగును ?

ఉత్త : బిడ్డలు చెప్పినట్లు నడువనపుడు బిడ్డలకు రోగాది బాధలు వచ్చినపుడు, బిడ్డలు మరణించినపుడు దుఃఖము కలుగునుగదా! కనుక, సుఖములో దుఃఖము దాగి యున్నదని గుర్తించుము.

ప్రశ్న : నేను రేడియో పెట్టుకొని, చేతికి గడియారము పెట్టుకొనియును సంతోషముగా నుంటున్నానుగదా, వా వలన దుఃఖమెట్లు కలుగును?

ఉత్త : రేడియోద్వారా తుఫాను వచ్చునని వా వినినపుడు, అయిష్టములైన మాటలున్ను, పాటలున్న నపుడున్ను బాధ కలుగునుగదా. మరియు రేడియో పోయినపుడున్ను, దొంగలు తీసికొనిపోయినపుడున్ను నే కలుగును గదా!

ప్రశ్న : నేను మత్స్య, మాంసములను భు సుఖముగా నుంటున్నానుగదా, వానివలన నాకు దుఃఖ కలుగును?

ఉత్త : మాంసభక్షణ చేయుటవలన పె పెట్టుదురు. సత్సంగమునకు రానివ్వరు. ప్రాణి హింసవ గలిగిన పాపమువలన ఈ జన్మములోగాని, ముందుజన్మ మకు గాని తప్పక ఏ రూపముగానైనను దుఃఖములు వచ్చున

ప్రశ్న : మా ఇంటిలో దేవతావిగ్రహములు భగవద్గీతాది సద్గ్రంథములు కలవు. నేను దేవుని పూజిం గ్రంథములను చదువుకొనుచు ఆనందము ననుభవిం చున్నాను. వానిలో దుఃఖమేమి గలదు ?

ఉత్త : వాటిని దొంగలు దొంగిలించినను, ఇతరుల తీసికొనివెళ్లి మరల ఇవ్వకున్నను, అగ్నిచే, వర్షముచే పని రాకుండ పోయినను దుఃఖము కలుగునుగదా ! కనుక నామ రూప, క్రియలతో అనుభవింపబడుచున్న సుఖములలో దీపముక్రింద చీకటి దాగియున్నట్లు దుఃఖము దాగియుండున గ్రహించి వైరాగ్యముతో నామ రూప రహితమైన నిర్గు సచ్చిదానంద పరమాత్మను నమ్మి సదా ధ్యానించు శాశ్వతానందము ననుభవించు చుండుము.

'ఆత్మానంద సముద్రస్య
విప్లుషో విషయో స్థితా.'

తా. ఇంద్రియ విషయ సుఖములు ఆత్మానంద మనె సముద్రములోని తుంపురులే యగును.

## దుఃఖ మెపుడు వచ్చును?

(1) బ్రతుకుపై తీపియున్ను, చావు అనిన భయమును ఉన్నప్పుడు దుఃఖము వచ్చును.

(2) తన పెత్తనము సాగనప్పుడు. పట్టిన పట్టు నె వేరనప్పుడు దుఃఖము వచ్చును.

(3) ఇష్టమైన వస్తువులున్ను, మనుష్యులున్ను దూరమై నప్పుడున్ను (నశించినపుడు), ఇష్టముకాని వస్తువులున్ను మానవులున్ను లభించినప్పుడున్ను దుఃఖము వచ్చును.

(4) స్తుతియందు ప్రీతియు, నిందలు వచ్చినపుడు ద్వేషము కలిగినపుడు దుఃఖము వచ్చును.

(5) లాభము నందు ప్రీతియు, నష్టము నందు అయిష్టతయు ఉన్నపుడు దుఃఖము వచ్చును.

(6) ఉపకారము చేసినవారిపై ప్రేమయున్ను, అపకారము చేసిన వారిపై ద్వేషమున్ను ఉన్నపుడు దుఃఖము వచ్చును.

(7) సర్వమున్ను భగవంతునిదే యను విషయమును మరచి 'ఈ వస్తువులు నావి, యీ మానవులు (పశువులు) నావారు' అను మమకారము నుంచినపుడు దుఃఖము కలుగును.

(8) ఆత్మయే తా నను విషయమును మరచి, దేహాభిమానముతో నున్నపుడున్ను దుఃఖము వచ్చును.

(9) ఆత్మతో చూడక (వినక) త్రిగుణాత్మక మనస్సుతో నామ రూప క్రియా రూపమైన ప్రపంచమును చూచుచున్నపుడు దుఃఖము వచ్చును.

(10) సుఖ దుఃఖములను, స్తుతి నిందాది శబ్దములను, లాభనష్టములను, చావు పుట్టుకలను, శీతోష్ణములను, స్త్రీ పురుషాది ప్రాణులను సమముగా గాంచక భేదములుగా చూచుచున్నంతవరకును దుఃఖములు వచ్చుచునేయుండును.

(11) ఐశ్వర్య మదముచే (గర్వముచే) కన్ను మిన్ను గానక, చెడుపనులు చేసినపుడున్ను దుఃఖము వచ్చును.

(12) పెద్దలను, దేవతలను, భక్తులను, వేదశాస్త్రములను అగౌరవించినచో దుఃఖములు వచ్చును.

(13) మనోవాక్కాయములచేత యితర మానవా
ప్రాణులను పీడించినచో దుఃఖములు వచ్చి పైబడును.

(14) మహాత్ముల మాటలయందు, భగవద్గీతా
శాస్త్ర ధర్మములయందును, భగవంతుని యందును నమ్మక
భక్తి, విశ్వాసమునుంచక ఇష్టానుసారముగా వర్తించినపుడు
దుఃఖములు వచ్చును.

(15) దూషించినవారిని తిరిగి దూషింపదలచినపుడు
కొట్టినవారిని తిరిగి కొట్టవలెనను ఆవేశమున్నపుడు. దొంగి
లించిన వాని సొమ్మును తిరిగి దొంగిలించవలెనను పట్టుద
యున్నపుడు బాధలు వచ్చును.

(16) మంచివారనియు, మంచి వస్తువులనియు, మంచి
మాటలనియు, మంచి శబ్దములనియును అధికముగా ప్రేమ
నుంచినపుడున్ను, ఇట్లే చెడ్డవారనియును, చెడు వస్తువు
లనియును, చెడ్డమాటలు (శబ్దములు చెడ్డవి) అనియును
అధికముగా ద్వేషము గలిగియున్నను బాధలు వచ్చును.

## సుఖపడువారలలో తరగతులు

పనుల జేయుచు సుఖపడువారు, పనుల జేయక
సుఖపడువారు, అనేక చోట్లకు తిరుగుచు సుఖపడువారు
ఒకచోటనే నివసించి సుఖపడువారు, మాటలతో సుఖపడు
వారు, మౌనముతో సుఖపడువారు, సంసారముతో సుఖ
పడువారు, సన్న్యాసముతో సుఖపడువారు, ధనముతో
సుఖపడువారు, ధనమును ముట్టక సుఖపడువారు, పరులకు
సేవ చేయుచు, సంతోషించువారు, పరులకు అపకారము
చేయుచు సంతసించువారు, పరుల తప్పులను వెదకు

సంతోషపడువారు, తమ తప్పులను తామే తెలిసికొని సవరణ జేసికొనుచు సంతసించువారు, పొగడుచు సంతోషించువారు, నిందించుచు సంతసించువారు, మోక్షధర్మములను చదివి సంతసించువారు, లౌకిక విషయములు గల గ్రంథములను చదివి సంతసించువారు, భగవంతుని, మహాత్ములను కీర్తించుచు, స్మరించుచు సంతసించువారు, ఇంద్రియ విషయసుఖములను పొగడి స్మరించి సంతసించువారు, సంకల్పములతో సంతసించువారు, నిర్వికల్పాత్మతో సుఖపడువారు, అఖండ పరబ్రహ్మ సాక్షాత్కార జ్ఞానముతో సుఖపడువారు, వాచా వేదాంతముతో సంతసించువారు, అనుష్ఠాన వేదాంతముతోనే సుఖపడువారు, ఆడంబరములతో సుఖపడువారు, నిరాడంబర నిరహంకారములతో సుఖపడువారు, గురువుగానుండి సుఖపడువారు శిష్యుడుగానుండి సుఖపడువారు.

## ( దుఃఖపడు వారలలో తరగతులు )

వ్యాధులతో బాధపడువారు, దరిద్రముతో బాధపడువారు, దుర్మార్గులచే బాధపడువారు, పనుల జేయలేక బాధపడువారు, పనులు దొరకక బాధపడువారు, భార్య మంచిది కాదని బాధపడువారు, భర్త మంచివాడు కాడని బాధపడువారు, బిడ్డలులేక బాధపడువారు, అధికసంతానముచే బాధపడువారు, బిడ్డలు చెడ్డవారైనారని బాధపడువారు, బిడ్డలు పోయిరని బాధపడువారు, స్వతంత్రత లేకపోయెనే యని బాధపడువారు, మోయలేని భారము నామీద పడినదే యని బాధపడువారు, కోరికలు నెరవేర

లేదే యని బాధపడువారు, క్రోధముచే బాధపడువారు, ముసలితనముచే బాధపడువారు, సేవచేయువారు లభిం లేదేయని బాధపడువారు, మనశ్శాంతి లేక బాధపడువారు, కోడంద్రచే బాధపడువారు, సత్సంగము. సద్గురువుని లభించలేదే యని బాధపడువారు, ఋణములచే బా పడువారు, పరమాత్మ యందు మనస్సు నిలుచుటలేదే య బాధపడువారు, దైవదర్శనము కాలేదేయని బాధపడువారున ఈవిధముగా లోకములో అనేక రీతులుగా బాధలు ప చున్నారు గదా! ఈబాధలన్నియును సుకృతము లే పోవుటచేత, దేహమే తానను అభిమానముండుటచే నాది నావారు అను మమకారముండుట చేతను కలు చున్నవని గ్రహించి ఆత్మజ్ఞానమును సంపాదించుము.

## పురుషప్రయత్నముతో
## పాపములను కష్టములను నివారణ జేసికొన వచ్చునా?

శ్లో. పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే।
తచ్ఛాంతి రౌషధం దానం జపహోమ సురార్చనై

తా. ఇదివరకు చేయబడిన పాపకర్మల దోషము వలన శారీరక బాధలు, మానసిక బాధలున్ను వచ్చు చుండును. ఆ బాధలు రాకుండుటకుగాను, వచ్చిన బాధ పోవుటకుగాను ఔషధమును సేవించవలెను. అన్న వస్త్రా లను దానము చేయవలెను. శివ, రామ, కృష్ణ, నారాయణా మంత్రములను జపము, స్మరణ, సంకీర్తనలను చేయుచుం వలెను. పూజలు చేయవలెను, హోమములను చేయుచుం

వలెను. సూర్యాది దేవతలకు నమస్కారములు ప్రదక్షిణ లున్ను చేయుచుండవలెను. అనిశాస్త్రము పురుష ప్రయత్నముతో బాధలను పాపములను పోగొట్టుకొనవచ్చునని చెప్పెను గదా.

రాహువు కష్టముల గురించి జ్యోతిష శాస్త్రము (శకున శాస్త్రము) చెప్పినప్పటికి జపధ్యాన దానసంకీర్తన నమస్కారాది సత్కర్మలజేసి కష్టములను చాలవరకు తగ్గించుకొన వచ్చును అని శాస్త్రములలో గలదు. అరవిందయోగికూడ చెప్పెను.

కథ : పాండ్యదేశమును పాలించుచున్న ఒక రాజునకు ఒక జ్యోతిష్కుడు ఒక దినమును నిర్ణయించి ఆదినమున రాజు పాముకాటుచే మరణించునని చెప్పెను. అప్పుడా రాజు భయపడినవాడై గురువాయుపురమునకు వెళ్లి విష్ణుమూర్తి యగు గురువాయురప్పన్‌ను భక్తివిశ్వాసములతో సేవించుచు అచ్చటనే మరణించుట మంచిదని నిశ్చయించుకొనియుండెను. జ్యోతిష్కుడు నిర్ణయించిన రోజు గడచిన తరువాత రాజు ఇంటికివెళ్లి జ్యోతిష్కునితో నేను పాముకాటుచే మరణింతునని చెప్పితివిగదా నేను మరణించలేదేమి! అనెను. అపుడు జ్యోతిష్కుడు రాజా, నేను చెప్పినరోజు పాము వచ్చి మీ ఎడమ పాదముపై కాటువేసెను. ఇదిగో, మచ్చచూడుడు. గురువాయురప్పన్ మీ భక్తిశ్రద్ధలకు మెచ్చి మరణము గలుగనీయక రక్షించెను అని చెప్పెను.

దేవుడు రక్షించుటవలన రాజు దేవుని దేవాలయమును బాగుచేయించెను.

కథ : నారాయణ భట్టాద్రి శ్రీ మన్నారాయణీ మను గ్రంథమును రచించుచు భగవానునకు సమర్పిం చుటవలన ఆయన వ్యాధి నివారణమయ్యెను.

కథ : ఫ్రాన్సు దేశమునందున్న శ్రీరామకృ శ్రమాధిపతియగు శ్రీ సిద్ధేశ్వరానందస్వాములవారు వాతముచే బాధపడుచున్న ఫ్రెంచివారిచే శ్రీమన్నారా ణీయమును పఠింపజేయగా వారి వ్యాధి రూపుమాసెను.

కథ : నారాయణతీర్థులు శ్రీకృష్ణ లీలాతరం యను గ్రంథమును వ్రాసి తన వ్యాధిని పోగొట్టుకొనె

శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామిని భక్తి శ్రద్ధల సేవించి అనేకులు ఇష్టార్థములను సిద్ధింప జేసికొనుచున్నా

సూర్యభగవానునకు నమస్కారములు చేసి అనేక రోగబాధలను పోగొట్టుకొనుచున్నారు.

పంచ పాండవులు కర్ణుడు వేయబోవుచున్న నారా ణాస్త్రమునకు నమస్కారము చేసి ఆపదనుండి తప్పిం కొనిరి.

పదియవ రోజున పాండవులను చంపెదనని ప్ర చేసిన భీష్మాచార్యులవారు తెల్లవారుజామున వచ్చి నమస రము చేసిన ద్రౌపదీదేవిని సుమంగళీభవ యని ఆశీర్వాద చేసెను. ఇది నమస్కార ప్రయత్న ఫలితమే గదా!

పులులను చంపెడు ఒక వేటగాడు ఒకనాడ పర్వతము నెక్కుచుండగా, అకస్మాత్తుగా పెద్దపులి ఎదుర వచ్చెను. వెంటనే అతడు తుపాకిని క్రిందపడవేసి నమస రము చేసెను. అపుడా పులి నెమ్మదిగా ప్రక్కకు తొ పోయెను.

వసుదేవుడు శ్రీకృష్ణ శిశువును యశోదగృహమునకు తీసుకొని వెళ్ళుచుండగా కంసుని పంపున గాడిదరూపముగా వచ్చిన రాక్షసునకు నమస్కారము చేసి కంసునకు చెప్పవద్దని చెప్పగా రాక్షసుడు చెప్పకయుండెను. అందువలన శిశువు క్షేమముగా నుండెనుగదా. ఇదియు నమస్కార ఫలితమే యగును.

ప్రశ్న : స్వామీ, శాస్త్రము "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అనియు "అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అనియును (అనగా ప్రారబ్ధకర్మ అనుభవింపక తప్పదనియు, చేసికొనిన పుణ్యాపాపకర్మల ఫలితములను తప్పక అనుభవించవలెననియును, చెప్పెనుగదా, మీరు పురుష ప్రయత్నముతో కష్టములను దాటవచ్చునని చెప్పెద రేల ?

సమా : ప్రారబ్ధకర్మ సామాన్య ప్రారబ్ధమనియు, విశేష ప్రారబ్ధమనియు రెండు విధములుగా నుండును. సామాన్య ప్రారబ్ధకర్మ దోషములను పురుషప్రయత్నముతో పోగొట్టుకొనవచ్చును. విశేష ప్రారబ్ధకర్మ దోషములను మాత్రమే తప్పక అనుభవించవలెను.

కర్మదోషమువలన రోగములు వచ్చినవారు ఆసుపత్రికి వెళ్లి ఔషధము సేవించినను కొందరి వ్యాధులు నివారణ మగుటలేదు. అనేకులు ఆరోగ్యవంతులై వచ్చుచున్నారు. కొందరు ఆసుపత్రిలోనే మరణించుచున్నారు. ఇవి ప్రారబ్ధ కర్మదోషముయొక్క ఎచ్చుతగ్గుల ఫలితములేగదా !

దైవప్రార్థనచేసి ద్రౌపదీదేవి దుశ్శాసనునివలన కలి
కష్టమును దాటెను.

దైవప్రార్థనచేసి ప్రహ్లాదుడు అంబరీషుడు గజేం
డును కష్టముల నుండి విడివడిరి.

విశేష ప్రారబ్ధకర్మదోషమును దేవుడుకూడ నివా
చేయ లేదు.

ప్రశ్న : ఇకనుండి నా శరీరమును, వాక్కును, :
స్సును ఎట్లు తృప్తిపరచవలెను, ఎట్లు నిశ్చలమొనర్చవలె

సమా : భక్తులతోను సాధువులతోను సాంగత్య
చేయుచు, వారితోపాటు నీవును దైవపూజ, భజన, పారాయ
జపము, ధ్యానము, సేవ, దానధర్మములను చేయుచుండు:
తప్పక సద్గ్రంథములను చదువుచుండుము, ఇట్లు చే
చున్నచో నీ పుత్ర మిత్ర బాంధవాదులు గ్రామస్థులు:
నిన్ను ప్రేమతో చూచుచు పొగడుచుందురు. ఇంద్రియము
మనస్సును నిశ్చలముగా ఆనందముగా నుండును.

కథ : ఒక పట్టణములో దొంగతనము చేయుట
నేర్పరులైన అన్నదమ్ములు గలరు. వీరివలన అనేకులు అ
విధములుగా బాధలు పడుచుండిరి. అందువలన పట్టణాధి
వీరి ముఖములపై దొంగలు అని ముద్రలు వేయించె
అప్పటి నుంచి చూచిన వారందరు దొంగలు వచ్చుచున్నా
దొంగలు పోవుచున్నారు. అని ( చెప్పుకొనుచుండిరి ) 
చుండిరి. ఈ యపకీర్తిని మొదటి దొంగ భరించలేక ఇ
గ్రామములలోనికి అడవులలోనికిని వెళ్లుచుండెను. అక్క
కూడ చింత బాధపెట్టుచుండుట వలన ఆత్మహత్య

కొనెను. రెండవ దొంగ బాగుగ ఆలోచించి ఇట్లు నిశ్చయించుకొనెను. ఇకనుండి నేను దొంగతనము చేయుట మాని దేవుని భజించుచు శక్తికొలది ఇతరులకు సేవ చేయుచుండెదను. నా ముఖమున దొంగ యను ముద్ర యున్నప్పటికి మంచి పేరు రాకుండునా, యనుకొని ప్రతి దినమును దేవుని భజించుచు చక్కని వర్తనలను సత్యము ధర్మము శాంతము దయ నిష్కామము నిరహంకారము మొదలగు సద్గుణములను అలవరచుకొని యుండెను. అందువలన చూచినవారు దొంగవచ్చుచున్నాడు. పోవుచున్నాడు అనుటకు బదులు, భక్తుడు వచ్చుచున్నాడు. సజ్జనుడు వెళ్లుచున్నాడు. అని అనుచుండుట మొదలు పెట్టిరి.

ఈకథ వలన ఎంత చెడ్డవారైనప్పటికి చెడు వర్తనలను చెడుగుణములను వదలి మంచి వర్తనలతో మంచి గుణములతో నున్న యెడల ప్రజలు దేవతలు మహాత్ములున్ను అనుగ్రహము చూపుదురని తెలియుచున్నది గదా!

## అఖండజ్ఞానాభ్యాసము

ప్రశ్న : తనలో ఆత్మను దర్శించుట గొప్పదా? బైట ప్రపంచమును ఆత్మ స్వరూపముగా భావించుచుండుట గొప్పదా?

సమా : మన నేత్రదృష్టి సరిగా యున్న ప్రపంచరూపములు సరిగా కనుపించును గదా! ఇట్లే వ ఆత్మస్వరూపమును శ్రవణ మనన ధ్యానముల ద్వా అనుభవములో నుంచుకొనిన మాత్రమే బైట ప్రపంచన రూపక్రియలను పరమాత్మ మయముగా గాంచ గలుగుద

స్వాత్మానుభవము లేనిచో గురువు శాస్త్రమును చెప్పినట్లు ప్రపంచమును భగవత్స్వరూపమే యని స్వాత్మ రూపమే యని భావించుచున్నను అది స్థిరముగా నిలువదు.

రోగి నేను ఆరోగ్యవంతుడనే యని భావించినచో అది నిలచునా? దరిద్రుడు నేను లక్షాధికారినని భావించిన నిలచునా?

చదువులేనివాడు, ఉద్యోగములేనివాడు నేను గొప్ప పండితుడనని నేను గొప్ప ఉద్యోగస్థుడనని భావించినచో ఆ భావన స్థిరముగా నిలచునా? ఇట్లే తపస్సు ద్వారా బ్రహ్మానుభవము నొందనివారు సర్వం ఖల్విదంబ్రహ్మ యను భావమును నిలబెట్టుకొన జాలరు.

విద్యార్థి నేను గొప్ప విద్వాంసుడను గొప్ప ఉద్యోగస్థుడను కావలెనని శ్రద్ధగా చదువుచున్నచో తన కోరిక నెరవేరవచ్చు.

ఇట్లే రోగి నేను ఆరోగ్యవంతుడను కావలెనని శ్రద్ధగా ఔషధమును సేవించుచు పథ్యముతో నున్నచో నీరోగి (ఆరోగ్యవంతుడు) కావచ్చు. ఇట్లే దరిద్రుడు నేను లక్షాధికారిని కావలెనని శ్రద్ధగా శ్రమపడి ఉద్యోగమో వ్యవసాయమో వ్యాపారమో చేయుచున్నచో తన కోరిక నెరవేరవచ్చు.

ఇట్లే భక్తులు, అభ్యాసులు, ముముక్షువులున్ను పరమ భక్తుడను, బ్రహ్మజ్ఞానిని, మహాత్ముడను, పరమహంసను కావలెనని ప్రయత్నించు చున్నచో ముక్తులు కావచ్చు.

ప్రశ్న : జీవుడు పరబ్రహ్మముతో సమానత్వ మెపుడు పొందును ?

సమా : కామము, క్రోధము, భయము, అహంకారము, మమకారము, అసూయ, ద్వేషము, సుఖము, దుఃఖము, సంకల్పము మొదలగు వికారగుణములను భేదభావములను పరబ్రహ్మ ధ్యానము ద్వారా నశింపజేసికొనినప్పుడు జీవుడు పరబ్రహ్మముతో సామ్యావస్థను పొందును.

## నిజమైన పరోపకార మేది ?

మరణానంతరము ధర్మము, భక్తి, ఆత్మజ్ఞానములే ఉద్ధరించునవి, ఆనందమయముగా నుంచునవియు నగును గాన జనులకు నీతిధర్మములను, భక్త ధర్మములను, జ్ఞాన వైరాగ్య ధర్మములను బోధించి మోక్షసుఖము నొందుటకు మార్గమును చూపుటయే నిజమైన పరోపకార మగును.

"సర్వేషామపిదానానాం జ్ఞానదానం విశిష్యతే"

తా. దానము లన్నిటిలో జ్ఞానదానమే గొప్పది. ఇతరదానములలో పుణ్యము పాపమున్ను కలసియుండునని చెప్పవచ్చు.

ప్రశ్న : "అన్నిదానములకన్న అన్నదానమె దొడ్డది" అని పెద్దలు చెప్పిరిగదా, అన్నదానములో పుణ్యమే కలదు గాని పాప మేమిగలదు ?

సమా : నీవు పెట్టిన ఆహారబలముతో పరోపకారము, దైవచింతన, పరమాత్మ నిష్ఠయు చేయుచున్నచో పుణ్యము గలదు. అపకారము చేయుచు దుర్మార్గు డనిపించుకొన్న వానికి ఆహారమును పెట్టినచో నీకు పాపమే వచ్చునుగదా!

ప్రశ్న : ధర్మాసుపత్రి పెట్టి రోగులకు ఔషధము నిప్పించి ఆరోగ్యవంతులను చేయుట పుణ్యము కాదా?

సమా : నీవు ఔషధము నిప్పించి ఆరోగ్యవంతులను చేసి పంపుచున్నప్పటికి వారు ఆరోగ్యబలముతో మంచి పనులను చేయుచున్నచో నీకు పుణ్యముగలుగుట తథ్యమే గాని చెడ్డపనులతో చెడ్డమాటలతో చెడ్డ సంకల్పములతో నున్నచో నీకు పాపమే కలుగును.

ప్రశ్న : చదువు చెప్పించుట పుణ్యము కాదా?

సమా : నీవు పాఠశాలలను నిర్మించి వందలాది విద్యార్థులకు చదువు చెప్పించినప్పటికి చదువుకున్న వారలలో కొందరు మంచివారై పావనులై ఇతరులను కూడ ధర్మాత్ము లను చేయుచున్నారు. కొందరు తాము చెడ్డమార్గము నవలంబించి ఇతరులనుకూడ చెడ్డవారినిగా జేయుచున్నారు. కొందరు ఇహాపరములకును పనికిరాని వారగుచున్నారు.

లోకములో సుకవులు, కుకవులున్ను కలరుగదా ఎందరో మహాత్ములు లోకమును పావనము చేయునట్టి పద్యములను గద్యములను కీర్తనలను శ్లోకములను వ్రాసినారు గదా. వీరేసుకవులు.

లోకమును చెడగొట్టునట్టి గ్రంథములను వ్రాసినవారు, సాధువులతో, భక్తులతోను వికటవాదనలనుచేసి పాపమును మూటకట్టుకొనుచున్నారు. కనుక చదువు చెప్పించుటలో కూడ పుణ్యపాపములు కలవని గుర్తించవలెను.

ప్రశ్న : సన్యాసాశ్రమ స్వీకారము గొప్ప పుణ్యప్రదమైనదని కొందరు చెప్పుచున్నారు. గృహస్థాశ్రమము

కొందరు చెప్పుచున్నారు. ఇక మీ యభి
మి తెలవిచ్చెదరు ?

మా : ఇంద్రియ విషయసుఖములకు లోబడక
న్యాదీంద్రియములకు సాక్షిగానున్న పరమాత్మ
సదా సంతుష్టులగుటకు ప్రయత్నించుచుండువారు
లనబడుదురు.

బహ్మచారులను, వానప్రస్థులను, సన్యాసులను
చు నిష్కామముగా భగవంతుని భజించుచుండు
హస్థులన బడుదురు.

హంకారమును వదలుకొను చుండుట సన్యాసి
మమకారమును త్యజించుచుండుట గృహస్థుని

ర్వమున్ను పరమాత్మ స్వరూపమే యని సన్యాసి
చుకొనియుండవలెను. సర్వమున్ను దేవునిదే యని
డు నిశ్చయించుకొనియుండవలెను. అహంకార
మములను త్యజించినవారు గృహస్థులైనను సన్యాసు
గొప్పవారే యనబడుదురు.

హంకార మమకారములలోనే కామక్రోధాది
ులన్నియు గలవు.

ర్గుణములుగలవారు పాపులనియు దేశద్రోహు
దైవద్రోహులు గురుద్రోహులు ఆత్మ ద్రోహులని
చెప్పకతప్పదు.

ప్రశ్న : మఠములను దేవాలయములను అన్న
ను నిర్మించుట పుణ్యమేనా ?

సమా : సత్యధర్మములతో వైరాగ్య భక్తి జ్ఞ ముతో నున్నవారిని పోషించుచున్న యెడల పుణ్యః గలుగును. సోమరులను, కలహప్రియులను, స్వార్థపరులః నాస్తికులను పోషించుచున్నచో పాపమే యగును.

ప్రశ్న : ధర్మమనగానేమి ? అధర్మమనగానేమి ?

సమా : ఎక్కువ పుణ్యము కొద్దిగా పాపమున కల ప్రవర్తన ధర్మమగును.

ఎక్కువ పాపము కొద్దిగా పుణ్యమున్ను గలిగిం నట్టి ప్రవర్తన అధర్మమగును.

ప్రశ్న : జ్ఞానమనగానేమి? అజ్ఞాన మనగానేమి ?

సమా : ఎక్కువగా ఆత్మ దృష్టియు స్వల్పము దేహదృష్టియు గల ప్రవర్తన జ్ఞానమగును.

ఎక్కువగా దేహాభిమానమును స్వల్పముగా దైవా దృష్టి ( భక్తియు ) గల ప్రవర్తన అజ్ఞానమగును.

శ్లో. కార్యమణ్వపి కాలేతు
కృత మేత్యుప కారతామ్
మహాతత్యుప కారోపి
రిక్తతా మేత్య కాలతః —విశ్వామిత్రు

తా. అవసరమైన సమయములో చేసిన సహాయః కొద్దిది యైనను అది ఉపకారమనబడు చుండును. అవసరః లేనప్పుడు విశేషముగా సహాయము చేసినను ః సంతోష సుఖములను కలిగించ నందున ఉపకారవ చెప్ప వీలుబడదు. ఎట్లన :

ఆకలి లేనప్పుడు ఆహారము పెట్టినచో పుణ్యము లేదు. వస్త్రములు అవసరము లేనపుడు వస్త్రదానము చేసినను పుణ్యము కలుగదు. శరీరము అన్ని విధములుగ ఆరోగ్యమున్నపుడు సేవ చేసినచో పుణ్యము కలుగదు.

రోగము లేనపుడు ఔషధదానము వలన పుణ్యము కలుగదు.

## పుణ్యకర్మలు

ప్రశ్న : దేవాలయములకు, మఠములకును అధిపతిగా నుండుట పుణ్యమేనా ?

సమా : దేవుని (సద్గురుని) సొమ్మును నీ సుఖము కొరకు, నీ కీర్తికొరకు, నీ బంధుమిత్రాదులకొరకును ఖర్చు పెట్టుకొనక సదుపయోగము చేయుచున్నచో పుణ్యమే.

ప్రశ్న : తీర్థయాత్ర చేయుట పుణ్యమేనా ?

సమా : ఇతరులకు బాధగలిగించక అసత్యమాడక దొంగతనముచేయక బ్రహ్మచర్యవ్రతము తప్పక ఇతరుల సొమ్ముతినక స్నానము దైవదర్శనము దానము భగవన్నామ సంకీర్తనము జపధ్యానములనుచేయుచు యాత్రచేసినచో పుణ్యమే.

ప్రశ్న : మఠములో నివసించుట పుణ్యమేనా ?

సమా : ఇతర మానవాది ప్రాణులకు బాధ గలిగించక హితముగా వర్తించుచు జపధ్యానాది సత్కర్మలు చేయుచున్నచో పుణ్యమే.

ప్రశ్న : పారాయణ, పూజ, భగవన్నామస్తవము, జపధ్యానములను చేయుచుండుట పుణ్యమేనా ?

సమా : ఇతరులు కష్టనష్టముల పాలుకావలెనను తలంపులేకుండ దేవుని అనుగ్రహప్రాప్తికొరకు చేయుచున్నచో పుణ్యమే.

ప్రశ్న : మౌనవ్రతములు, ఉపవాసాదివ్రతములను చేయుచుండుట పుణ్యమేనా ?

సమా : నీవు ఇతరులకు ఏ రూపముగాను క్లేశము కలిగించక భగవంతుని మరువక స్మరించుచున్నచో పుణ్యమే.

ప్రశ్న : బ్రహ్మ చర్య వ్రతములో నుండుట పుణ్యమేనా ?

సమా : పరమాత్మను ధ్యానించుచు పరులకు సేవ చేయుచున్నచో పుణ్యమే.

ప్రశ్న : గృహస్థాశ్రమమును స్వీకరించుట పుణ్యమేనా ?

సమా : అన్యాయ మార్గమున ధనమును సంపాదించక భగవంతుని భజించుచు శక్తి కొలది బ్రహ్మచారులను వానప్రస్థులను సన్యాసులను అంగహీనులను వృద్ధులను పోషించుచున్నచో పుణ్యమే.

ప్రశ్న : సన్న్యాసాశ్రమమును స్వీకరించుట పుణ్యమేనా ?

సమా : కామము క్రోధము మమకారము ఆశ భేదబుద్ధులను వదలి పరమాత్మను మరువక యుంటున్నచో పుణ్యమే.

ప్రశ్న : వేదాంతోపన్యాసములు ఇచ్చుట, పురాణములు జెప్పుటయు పుణ్యమేనా !

సమా : ఆహ్వానించిన చోటికి వెళ్లి ధనమును అన్న వస్త్రాదులను యాచించక ఎవ్వరికిన్ని బాధగలిగించకున్నచో పుణ్యమే.

## మహాత్ముల పలుకులు

నేను భవిష్యత్తును గురించి ఎప్పుడూ ఆలోచించను. అది దానంతట అదేవస్తుంది. —ఐన్‌స్టయిన్

బాధను పూర్తిగా అనుభవించడమే బాధానివృత్తికి మార్గము. —మార్సెల్ ప్రూస్ట్

కష్టాలలోనున్నప్పుడు సంతోషదినాలను జ్ఞాపకం తెచ్చుకోవడంకంటె దుఃఖంలేదు. —డాంటే

కష్టములు దేహధనాదులు అనిత్యములైనవని, దేవుడే నిత్యుడనియు, నీతి ధర్మములను తప్పరాదనియును బోధించు చుండును. —శివానందస్వామి

శరీరమనెడి స్వత్వము నందు వున్నందుకు చెల్లించు అద్దె కష్టములు. —శ్రీరామకృష్ణ పరమహంస

భక్తుడు భరించలేనంత కష్టములను భగవంతుడు కలిగించడు. — గాంధీ

పాపము చేసినచో దుఃఖములు వచ్చును. పుణ్యము చేసినచో సుఖ సంతోషములు కలుగును. —పతంజలి

దుఃఖములను దాటుచున్నకొలదీ భక్తుడు దేవుని సమీపించు చుండును. —శ్రీవివేకానంద స్వామి

నీతి ధర్మముల నిమిత్తము దేవుని నిమిత్తమును కష్టములను అనుభవించుచుండువారు ధన్యులు. —క్రీస్తు

భగవద్విశ్వాసం లేని కారణంచే మానవుడు ఎడతెగని కడగండ్ల పాలౌతున్నాడు. —(శ్రీరామకృష్ణ పరమహంస)

నా పరాజయానికి పతనానికి ఎవరూ కారకులు కారు. నాకు నేనే పరమ శత్రువును. నా విషాదాంతానికి నేనే కారకుణ్ణి. — నెపోలియన్

తెలివిహీనుని హృదయం అతని జిహ్వాలో ఉంటుంది. ప్రాజ్ఞుని జిహ్వామాత్రం అతని హృదయంలో వుంటుంది. —ఫ్రాంకిన్

సత్యం ఎంత చిన్నస్థలంలోనైనా ఇమిడిపోతుంది అసత్యానికే చోటు ఎక్కువకావాలి. —హెన్రీసెట్ జాన్

చెడ్డమనిషికి ఉపకారముచేయడం మంచిమనిషి గాయపరచడమంత ప్రమాదకరమైనది. —ప్లాటస్

ఏమనిషీ తాను జీర్ణంచేసికోగల వాటికంటే ఎక్కువ విశ్వాసాలను మింగకూడదు. —హెవ్ లక్ ఎల్లిస్

నీవు ఎక్కడతిరిగినా చిట్టచివరకు ఆత్మను చేరుకో వలసిందే. —రమణమహ

నేను నాది అనుకొన్నప్పుడే అన్నిబాధలు ప్రారంభ మౌతాయి. నాది అన్న భావంనుండి స్వార్థం స్వార్థంవ ఆవేదన జనిస్తాయి. —శ్రీ వివేకానందస్వా

నీ శత్రువునుండి నీవు తప్పించుకొనడం సాధ్యమే కాని నీవుచేసిన దుష్కృత్యంనుండి నీవు తప్పించుకొనలేవు అది జీవితమంతా నిన్ను వెంబడిస్తూనే ఉంటుంది. —తిరువళ్లువా

కన్నీటిబిందువులకన్నా, చిరునవ్వులే నిజమైనసంపద.
—శ్రీ అరవిందులు

సత్యమే భగవత్స్వరూపం. సత్యంకొరకు ఎంతటి త్యాగమైనా చేయవలసినదే, సత్యపరిశోధన మానవుని పవిత్రకర్తవ్యం.
—గాంధీజీ

భిన్నత్వంలో ఏకత్వాన్ని అన్వేషించడమే విజ్ఞానం.
—వివేకానందస్వామి

మానవులను ద్వేషించడం ఎలుకలున్నవని ఇల్లును తగలబెట్టుకొనడం వంటిది.
—హేర్రీఎమర్సన్ ఫాస్టిక్

కోరికలు లేకుండా ఉండడమే దైవత్వం అని నా విశ్వాసం.
—సోక్రటీస్

పవిత్రము నిర్మలము అయిన అంతరంగములోనే సత్యం ప్రకాశిస్తుంది.
—బుద్ధుడు

మేధాసంపన్నులకు ఈలోకం ఒక ఆనందరూపకం. సున్నితహృదయులకు ఈలోకం ఒక విషాదనాటకం.
—హొరేస్ వాల్పోల్

స్వర్గంలోని స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకన్నా ఈభూలోకంలో మానవసేవే గొప్పది.
—అరవిందులు

ఎంతవరకు మీక్రింద ఒక్కడు ఉండవలెనని మీకు తలంపు గలదో అంతవరకు మీరు మరియొకరి క్రింద యుండవలసి యుందురు.
—శ్రీ మళయాళ సద్గురువు

## (అల్పుడు - మహనీయుడు)

ఎవడు దేవునికై తన్ను (అహమును) అణచిపెట్టుకొనునో అతనికి దేవుడు ఉన్నతిని కలిగించును. అతడు

తన మనస్సులో అల్పుడు. కాని ప్రజల దృష్టిలో మహనీయుడు.

పొగరు, గర్వము గలవానిని దేవుడు లోకద్వేష్యునిగా చేయును. అతడు ప్రజలదృష్టిలో అల్పుడు. తన మనస్సులో మహనీయుడు. అట్లగుటచే నతడు ప్రజలకు కుక్కకంటెను, పందికంటెనుకూడ మరింత చులకనయగును. —మహమ్మదు

మంచినడవడి అనేది అల్పులలో రెండుకారణాలవల్లా కనిపించవచ్చు. ఒకటి దండనభీతి, రెండవది ప్రయోజనాపేక్ష. —ఆంధ్రప్రభ

దేనినైనను ప్రేమింతువేని చెవిటివాడవుగను గ్రుడ్డివాడవుగను అగుదువు.

ఐశ్వర్యము లౌకికవస్తువుల సమృద్ధినుండి గలుగదు. సంతుష్టమైన చిత్తమునుండియే కలుగును.

గోరీలను (సమాధులను) దర్శించుచుండుడు. ఏలయన ఇహలోకమందు మీకవి ఔదాసీన్యమును కలిగించును. భవిష్యత్తును స్మరింపజేయును.

ఏది మంచిదో దానిని మాత్రమే దేవుడంగీకరించును.

ఎవని వలన మానవకోటికి మేలు గలుగునో వాడే మానవులలో శ్రేష్ఠుడు.

ఈ జగమునందు వైరాగ్యమనగా ఆశలను తగ్గించుకొనుట.

ఆత్మనెరిగినవాడు భగవంతునెరిగినవాడే.

—మహమ్మదు

నీలో మంచి గుణము ఉన్నప్పుడు ఇతరులు నీలో చెడ్డ గుణము ఉన్నదని తలంచినచో అది అబద్ధమని నిశ్చలముగా నుండుము. ఇట్లే నీలో దుర్గుణము ఉన్నప్పుడు ఇతరులు నీలో మంచి గుణముగలదని పొగడినచో అది అబద్ధమే యని నిశ్చలముగా నుండి పరమాత్మ ధ్యానములో నుండుము.

అట్టడుగున (ఆత్మయందున) గల మనిషికి పతనభీతి వుండదు. —జాన్ బున్యన్

వేదాంతి ఎవరంటే చీకటిగదిలో నల్లపిల్లికోసం వెదికే అంధుడు (అజ్ఞాన హృదయములో ఆత్మాన్వేషణ చేయువాడు). —లార్డ్ బోవెన్

ఆత్మను తెలియనీయక బాహ్యప్రపంచము అడ్డు తగులుటలేదు. మానసికప్రపంచమే అడ్డువచ్చుచున్నది గాన మనస్సును జయించవలెను.

అన్ని భారములు భూమిమీదనే గలవు. ఆకాశమునకు భారమేమియు లేదు. ఇట్లే అహంకారికి అనేక బరువులుండును. నిరహంకారికి బరువేమియు నుండదు. అహంకారికి దేహధనాదులపై గల మమకారమే బరువు.

మమకారమును దేవునిపై నుంచువారే భక్తులు. అహంకార మమకారములు లేనివారే జ్ఞానులు.

నన్ను దూషించినవాడు నాకు నా తల్లిదండ్రులకంటె అధికప్రియుడు. అతడు పాపము తానుమునిగిపోయి నన్ను సంసారమునుండి తరింపజేయుచున్నాడు. —నా|బా

అహంకారము బ్రతికియున్నంతవరకును బాధ్యతలుండును.

చిత్తశుద్ధిని గలిగించని కర్మలన్నియు వినోదము కొరకుగాని ఆడంబరముకొరకుగాని స్వార్థముకొరకుగా చేయబడుచుండును.

హృదయశుద్ధిలేనివారు ఎచ్చట నున్నను బాధల పడుచునేయుందురు.

అనుభవానికి మూడు పునాదులు. హెచ్చుగాచూడడం ఎక్కువగా బాధలు అనుభవించడం, హెచ్చుగా అధ్యయన చేయడం. — కేథరా

ప్రపంచమే నా దేశం, నిఖిల మానవాళి నాసోదరులు సత్కార్యాలు చేయడమే నామతం. — థామస్ పెయి

జన్మవల్లనే కాక సద్గుణాలవల్లనే మనం ఉత్త మానవులం కాగలము. గొప్పకార్యాలు గొప్ప మనసు లను చాటగలవు. — జాన్ ఫ్లెచ

దైవాన్ని గురించి విడమర్చి చెప్పలేము. వాదిం లేము. సిద్ధాంతీకరించలేము. చర్చించలేము. మన సాధ్యమైనదల్లా ఒకటే. దైవాన్ని సేవించగలం.

— మెహార్ బా

న్యాయంగాను, ధర్మంగాను, వ్యవహరించకుండ సంతోషంగా జీవించలేవు. సంతోషంగా జీవించకపో న్యాయంగా ధర్మంగా వ్యవహరించలేవు.

— ఎపిక్యూర

ఆనందం కావాలో అధికారం కావాలో తేల్చుక మంటాడు భగవంతుడు. రెండూ లభ్యం కమ్మంటే కా

— ఎమర్స

ప్రేమను విత్తి శాంతిని పండించు. నమ్రతను విత్తి గౌరవాన్ని పండించు. ధ్యానాన్ని విత్తి జ్ఞానాన్ని పండించు. ప్రార్థనను విత్తి అనుగ్రహాన్ని పండించు.

—స్వామి శివానంద

## స్వయం సాధన

నేను తిన్నది నేనే జీర్ణించుకోవాలి కాని ఎంతటి వాడైనా మరొకడు నాకు ఈ పని చేసిపెట్టలేడు. అలాగే భగవంతునితోటి ఐక్యాన్ని స్వయంగా నేనే సాధించాలి కాని ఏ మహానుభావుడూ నాకు ఈ విషయంలో సహాయ పడలేడు.

—స్వామీ రామతీర్థ

## జ్ఞానవృక్షాభివృద్ధి క్రమసాధనలు

(శ్రీ మలయాళ సద్గురు ఉపదేశసారము)

రాళ్ళు సున్నమును లేని భూమిలో పెట్టిన విత్తనము బాగుగా మొలకెత్తి వృద్ధియగుచుండునట్లు కామ, క్రోధ లోభ, మమకార, గర్వ, అహంకారాది దుర్గుణములు లేని హృదయముగల వారిలో సద్గురువులు చెప్పిన మంత్రములు, నీతి, ధర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్య విషయములు బాగుగా నాటుకొని వృద్ధియగు చుండును.

ఉప్పునీళ్ళు వేడినీరును పోయక మంచినీళ్ళను చెట్లకు పోయుచున్నచో వృద్ధియగు చుండునట్లు అన్యాయార్జితము లైనవి, రాజస తామసములైనవి యగు ఆహారములను భుజించక న్యాయార్జితములైనవి సాత్త్వికములైనవి యగు ఆహారములను భుజించుచున్న మాత్రమే మానసాదీంద్రియ ములు శాంతముగా నుండును.

ఉదయము మొదలుకొని సాయంత్రము వరకున వృక్షమునకు సూర్యరశ్మి తగులుచుండిన మాత్రమే వృక్షమ పెరుగుటకు అనుకూలించు విధముగ ఉదయము నిద్రలేచినద మొదలుకొని రాత్రి నిద్రించువరకును ప్రతిదినము మోక్ష పేక్షతో, పరమాత్మ చింతనతో నుండిన మాత్రమే జ్ఞానమ వృద్ధియగుచుండును.

విషవాయువు వేయక మంచివాయువు వీచుచుండి మాత్రమే వృక్షము వృద్ధియగుటకు అనుకూలించునట్ల మనస్సు దుర్గుణములను చింతనచేయక శమదమాది మంచి విషయములను మననము చేయుచుండిన మాత్రమే జ్ఞానమ వృద్ధియగుచుండును.

ఆకాశముయొక్క అవకాశ ముండిన మాత్రమే వృక్షము పెరుగునే గాని ఇరుకులో పెట్టినచో పెరగనట్ల స్వార్థగుణమును నీవు, నేను అను భేదబుద్ధిని వదలి విశా మైన అఖండ భావమును పోషించుకొనుచుండిన మాత్రమే అద్వైతాత్మ విజ్ఞానము కలుగును.

పై చెప్పబడిన పంచశీలములను ఉత్సాహముతో ఓర్పుతో ఆచరణలో పెట్టనిదే అజ్ఞాన దుఃఖములు నశించవ

## అజ్ఞానవృక్షమును వినాశమొనర్చు సాధనలు

పెద్దవృక్షముయొక్క చిన్న చిన్న కొమ్మలను నర నంత మాత్రమున వృక్షము చావనట్లు తీర్థయాత్ర- సేవ ఉపవాస- మౌనవ్రతములు, పూజలు, భజనలున్ను చేసినం మాత్రమున అజ్ఞానవృక్షము చావదు.

వృక్షముయొక్క పెద్ద పెద్ద కొమ్మలను నరికినను వృక్షము చావనట్లు, జపము ధారణ ధ్యానములను చేయు చున్నను అజ్ఞాన వృక్షము చావదు,

వృక్షముయొక్క మొదలు నరికివేసినను కొన్ని వృక్షములు చావనట్లు తీవ్రముగా బ్రహ్మచింతన ధ్యాన సమాధులను అభ్యసించుచున్నను అజ్ఞానవృక్షము పూర్తిగా చావదు.

వృక్షముయొక్క మూలమును అనగా కూకటి వేరును పెరికి పారవేసినప్పుడు మాత్రమే వృక్షము నిశ్శేషముగా నశించునట్లు ధ్యాతృ, ధ్యాన, ధ్యేయ భేదములులేని ( జీవ బ్రహ్మలనెడి భేదము లేని ) కేవల సహజ సమాధియొక్క అనుభవము కలిగినప్పుడే అజ్ఞానవృక్షము పూర్తిగా నశించును.

అజ్ఞానమును నశింపు జేసికొనక, నేను జ్ఞాని ననియు నాకు మరల జన్మ లేదనియును చెప్పుకొనుచుండువారు మూఢులు.

( వేశ్య మోక్షమొందిన విధము )

## రుద్రాక్షమాల ధారణా ప్రభావంచే మనుష్య జన్మలెత్తిన కోతి, కోడి.

నందిగ్రామమనే ఊరిలో మహానంద అనే అందాల బరిణె అయిన ఒక వేశ్య వుండేది. ఆమె మహా ఐశ్వర్య వంతురాలు. ఛత్ర, చామర, యాన, పాదరక్ష లన్నీ బంగారువే యగును. చిత్ర చీనాంబరాలు ధరించేది.

పుష్కలమైన పాడిపంటలతో దాస దాసీజనములతో అప
పరివారముతో సమస్త అలంకారాలు ధన రత్నరాసు
కలిగి శోభించేదామె.

ఇంతటి ఐశ్వర్య సంపన్నురాలైన మహానంద స
ధర్మపరాయణ, శివపూజయం దాసక్తురాలు, బ్రాహ్మ
భక్తియుగలది.

ఆ వేశ్య వినోద కాలక్షేపంకోసమని ఒక కోతిని,
కోడిని పెంచుకున్నది. వాటిని రుద్రాక్షమాలలతో అల
రించి నాట్యమండపానికి తీసుకువచ్చి తాళ గీత వాద్యాల
ఆ రెంటిని ఆడించేది. రుద్రాక్షమాలికలతో కర్ణాభరణాలై
కుండలాలతో తయారైన ఆవానరం ఒక బాలకుడులా
నృత్యం చేస్తుంటే శిఖపైన రుద్రాక్ష కట్టుకున్న కోడి, కోతి
సమానంగా నాట్యం చేసేది. ఇది చూసిన ప్రేక్షకు
ఆనందంతో తన్మయు లయ్యేవారు. ఇలా చాలా కా
గడిచింది.

ఒకరోజున జడలు త్రిపుండ్ర రుద్రాక్షమాలలు ధరిం
శివభక్తుడు వేశ్య ఇంటికి వచ్చాడు. స్వచ్ఛమైన భస్మ
తోను, మహారత్నాలతో పొదిగిన కంకణముతోను, సూ
భగవానునివలె ప్రకాశించుచున్న ఆ శివభక్తుని వే
పూజించి మనస్సులో మిక్కిలి సంతోషం పొందింది.

తరువాత అతని ముంజేతినున్న కంకణంచూ
ఆశ్చర్యంతో మహాత్మా దివ్యరత్నాలతో నిండిన ఈ కంక
ఎంత చక్కగా ఉన్నదీ, ఇటువంటి భూషణము నావంటి ది

స్త్రీ హస్తాన్ని అలంకరించటానికి తగియున్నది. ఏమంటారు అని ప్రార్థేయ పూర్వకంగా అడిగింది.

ఆ శివభక్తుడు చిరునవ్వుతో ఆమెను చూచి సరే నీ మనస్సులో ఉద్దేశము నెరవేర్చి ఈ దివ్యకంకణం నీ కిస్తాను. అభ్యంతరంలేదు. కాని, మరి దానికి సరిఅయిన విలువ ఇవ్వగలవా, యని అడిగాడు.

అందుకామె మహనీయా! మేము వేశ్యలమేగాని పతివ్రతలము కాము. మా కులాచార ధర్మం తెలుసుకదా. అయితే రత్నఖచితకంకణం నాకిచ్చితిరంటే, పూర్తి మూడు రాత్రులు, పగళ్ళును మీభార్యగా ఉంటాను అన్నది.

ఆ శివభక్తుడైన వైశ్యుడు ఒప్పుకొని చంద్రసూర్యులు సాక్షులుగా సత్యంగా మూడు అహోరాత్రులు తనకు భార్యగా నుందునని ఆమెచేత ప్రమాణం చేయించుకొని ఆ రత్నకంకణం మహానందకిచ్చాడు. అంతేకాదు దానితోపాటు రత్నమయమైన ఒక శివలింగంకూడా ఆమెచేతనుంచి ఈ లింగం నాకు ప్రాణప్రదమైనది. దీన్నికూడా భద్రపరచు. దీనికి భంగంకలిగితే నాకు ప్రాణభంగమన్నమాట. జ్ఞాపక ముంచుకో, అని చెప్పి యిచ్చాడు.

అలాగే దాన్ని మహానంద తీసుకొని, నాటకరంగ స్థలంలో ఒకచోట జాగ్రత్తపరచి లోపలికి వెళ్ళింది.

నిజధర్మాన్ని అనుసరించి మహానంద ఆనాటి రాత్రి మృదుశయ్యపైన వైశ్యుడితో క్రీడించి సుఖంగా నిద్రించింది.

అర్ధరాత్రివేళ నాట్యమండపంలో అకస్మాత్తుగా అగ్ని పుట్టుకొచ్చి మంటపమంతటినీ దహించివేసింది. ఎగసివచ్చే

మంటలుచూచి వేశ్య చటాలున లేచివచ్చి కోతిని కట్టిన తాడ ఊడదీసింది. దానితోపాటు కోడికూడ అగ్నికణాలు చిమ్ము కుంటూ భయంతో దూరంగా పారిపోయింది.

మంటపంతోపాటు వేశ్య మంటప స్తంభంలో దా పెట్టిన రత్నమయ శివలింగంకూడా పేట్లిపోయి ముక్క ముక్కలై పోయింది. అదిచూచి మహానంద శివభక్తుడుణ ఎంతగానో దుఃఖించారు.

వైశ్యుడు ప్రాణత్యాగానికి సిద్ధమయ్యాడు. ఎం చెప్పినా మానసుగాక మానసని అతడు దృఢనిశ్చయ డయ్యాడు.

శివవ్రతుడి ఆజ్ఞప్రకారం మహానంద తన సేవకులచే ఊరిచివర మైదానంలో చితి ఏర్పాటు చేయించింది. శి ధ్యానపరుడైన ఆ వైశ్యుడు అగ్నికి ప్రదక్షిణాలుచే పురజనులందరూ చూస్తూండగా ధైర్యంతో అగ్నిలో దుమికాడు.

వేశ్య అయిన మహానంద పరితపించింది. అంతలో ఆమె మనస్సుకి ఒక ధర్మసూక్ష్మం గోచరించింది. బంధ జనులతో తన నిశ్చయాన్ని ఇలా వెల్లడించింది. శివదీక్ష పరుడైన ఈ వైశ్యుడికి మూడురోజులు పత్నిగా ఉంటాన ప్రమాణం చేసి ఈ రత్నకంకణం పుచ్చుకున్నాను. గ కర్మంకొద్దీ మూడురోజులు పూర్తి కాకుండానే ఇటువం దుస్సంఘటన ఏర్పడి ఈయన మరణించాడు. నేను అత సహధర్మచారిణిని కనుక అతన్ని అనుసరించడం నావిధ సత్యం తప్పకూడదు. సత్యవర్తనమే పరమ ధర్మము. ఇ

ముక్తిమార్గము. దీన్ని మించిన ఉత్తమ గతి లేదు. కనుక సత్యాన్ని అనుసరించి నే నీశివభక్తునివెంట వెళ్ళబోతున్నాను. ఆమె నిశ్చయం విన్న బంధుజనం వద్దని ఎన్నోవిధాల వారించారు. కాని ఆమె ఎంతమాత్రం వినక, విప్రులకు దానా లిచ్చింది. సదాశివుని ధ్యానించింది. అగ్నికి ముమ్మారు ప్రదక్షిణం చేసి సిద్ధంగా ఉన్నంతలో మహేశ్వరు డామె భక్తికి మెచ్చి ప్రత్యక్షమై ఆమె అగ్నిలో పడకుండా వారించాడు.

కోటిసూర్యులకాంతితో ప్రకాశించే ఆ త్రిలోచనుని దర్శించి వేశ్యభయంతో కొయ్యబారిపోయింది. వెలవెల బోయే ముఖంతో వణికిపోతూ కన్నీటితో నమస్కరిస్తున్న ఆ మహానందను చెయ్యిపట్టుకొని శివుడు చెప్పాడు. "అమ్మా యీ నీ సత్యధర్మానికి నిశ్చలమైన శివభక్తికీ సంతోషించాను. నీ భక్తిని పరీక్షించటానికే ఈశ్వరభక్తుడైన వైశ్యుని రూపములో వచ్చాను. నామాయచేతనే మంటపంలో అగ్నిపుట్టింది. నేనే సర్పాన్ని దగ్ధంచేసి శివలింగాన్ని కాల్చి అగ్నిలో ప్రాణత్యాగం చేయించాను. సామాన్యంగా భోగకాంతలు మాయమాటలుచెప్పే జనవంచకులు. నీవు ఆలాగాక సత్యవ్రతవై అగ్నిప్రవేశం చెయ్యటానికి సిద్ధమయ్యావు కాబట్టి నీకు దేవతలు సయితం పొందలేని భోగాలు నేను అనుగ్రహిస్తున్నాను. చిరకాల ఆయుర్దాయం సంతానంవంటివి నీకేం కావాలో కోరుకో" అని చెప్పాడు.

అందుకు మహానంద "మహేశా! నాకు ఐహిక భోగాలు ఆముష్మిక భోగాలయందు ఆసక్తి ఏమీ లేదు. నీ పాదసేవ

తక్క నా కితరమేమీవద్దు. నా ఈ బంధు మిత్రులు పరివారజనం నీ దర్శనంకోసం వేచి వున్నారు. వీరందరినీ నాతోపాటు నీ పరమ పదానికిచేర్చు. పునర్జన్మ లేకుండా అనుగ్రహించు'' అని కోరగా మహేశ్వరుడు ఆలాగే అనుగ్రహించాడు.

నాట్యమంటపం దహించినపుడు తప్పించుకుపోయిన మర్కట, కుక్కుటాలు పారిపోయి అరణ్యంలో తిరిగి తిరిగి దేహం చాలించాయి. మరల కోతి, కాశ్మీర దేశాధీశుడగు చంద్రసేనుడను రాజునకు కుమారుడుగా పుట్టెను. అతని పేరు సుధర్ముడు. కోడి మంత్రికి కుమారుడుగ పుట్టెను. అతని పేరు తారకుడు. రాజు కుమారుడు మంత్రి కుమారుడును చిన్నప్పటినుండి ప్రాణస్నేహంతోనుండి విద్యాభ్యాసం కలిసి చేశారు. ప్రతిదినము శరీరమునకు విభూతి పూసికొని రుద్రాక్షమాలలు ధరించి శివనామ సంకీర్తన స్మరణలతో జీవితమును గడుపుచు ఇంద్రియ విషయ భోగములకు దాసులు కాక పరమేశ్వర ధ్యానముతోనే మహానందము నొందుచు చివరకు పరమశివ పదము నొందిరి. ఈ వృత్తాంతమును పరాశర మహర్షి చెప్పెను.

## స్వర్గమునుండి వచ్చిన వాని లక్షణాలు

శ్లో. దయాభూతేషు సద్భావః । పరలోకం ప్రతిక్రియా
సత్యా భూతహితాచోక్తిః । వేదప్రామాణ్య దర్శనం
గురుదేవర్షి సిద్ధర్షి। పూజనం సాధుసంగమః
సత్క్రియాభ్యసనం మైత్రి । చేతద్బుధ్యేత పండితః

అన్యానిచైవ సద్ధర్మ । క్రియాభూతాని యాని చ
స్వర్గచ్యుతానాం లింగాని । పురుషాణామపాపినామ్

తా. 1. భూతదయ 2. సత్యము 3. పరోపకారము 4. సత్సాంగత్యము 5. భగవద్భక్తి 6. గురుసేవ 7. శాస్త్ర ప్రమాణబుద్ధి 8. దానధర్మాది సత్కార్యము లాచరించుట 9. పరలోక సుఖమునకై పాటుపడుట మున్నగునవి.

## నరకమునుండి వచ్చిన వాని లక్షణాలు

శ్లో. పరనిందా కృతఘ్నత్వం । పరమర్మావఘట్టనం
నైష్ఠుర్యం నిర్ఘృణత్వంచ । పరదారోపసేవనం
పరస్వహరణాశౌచ । దేవతానాంచ కుత్సనం
నికృత్యా వంచనానౄణాం । కార్పణ్యం చనృణాంవధః
యానిచప్రతిషిద్ధాని । తద్వృత్తించప్రశంసతాం
ఉపలక్షణాని జానీయాత్ । ముక్తానాంనరకాదను.

(మార్కండేయపురాణం) 15.42

తా. 1) పరులను నిందించుట, 2) బాధించుట, 3) మోసగించుట 4) చంపుట 5) పరదారధనాదులహరించుట 6) అనేక విధముల పరులకపకారము చేయుట 7) దేవతానింద 8) శాస్త్రదూషణ 9) చేసిన మేలు మరచుట మొదలగునవి నరకమునుండి వచ్చిన వాని లక్షణములని తెలిసికో.

# మంచి కొడుకు—చెడ్డ కొడుకు

పాదనామక్రియ - ఆదితాళము

1. ఇల తలిదండ్రుల తొలిదైవంబని
దలచిన వాడే పుత్రుడూ
కలిమి బలిమి గలదనియు బడాయి
జేసినవాడే శత్రుడూ ॥ ఇల

2. ధన ధాన్యంబులు తెచ్చి కుటుంబము
జరిపిన వాడే పుత్రుడూ
వినయము లేకను ఇతరులతో
పోరాడిన వాడే శత్రుడూ ॥ ఇల

3. ఆలితోను సంసారము జేసి
ఏలినవాడే పుత్రుడూ
కాలముగల పరస్త్రీలతోను
భోగించినవాడే శత్రుడూ ॥ ఇల

4. పెద్దల సేవలు చేసి సమిష్టిగ
నుండినవాడే పుత్రుడూ
హద్దు తెలియకను పెద్దలతో
వాదించినవాడే శత్రుడూ ॥ ఇల

5. పంచవింశతి తత్త్వములన్ని
యోచించిన వాడే పుత్రుడూ
కొంచములో మూడాశలు మొదటికి
త్రుంచనివాడే శత్రుడూ ॥ ఇల

6. ఎందుకొచ్చె నరజన్మంబని
మొర పెట్టిన వాడే పుత్రుడూ

అందరిలో అపకీర్తి తెచ్చి
దుఃఖించిన వాడే శత్రుడూ ‖ ఇల ‖

7. అష్టమదంబుల గొట్టి ఆర్గురిని
కట్టిన వాడే పుత్రుడూ
ఇష్టముతో శ్రీవిష్ణు దేవుని
వేడని వాడే శత్రుడూ ‖ ఇల ‖

8. ఎరుపు తెలుపు నలుపులోగురురాయుని
నెరిగిన వాడే పుత్రుడూ
నరశల్యంబుల దేహము స్థిరమని
నమ్మిన వాడే శత్రుడూ ‖ ఇల ‖

9. యోగమనగ నెట్టిదోవివరంబుగ
తెలిసిన వాడే పుత్రుడూ
బాగుగాను నారాయణభావము
నెరగని వాడే శత్రుడూ ‖ ఇల ‖

## ( మంచి కూతురు—చెడ్డ కూతురు )

ఆనంద భైరవి—ఆదితాళము

1. పతికతిహితమౌ మతిగలదై
సద్గతివెదకినదే సంసారీ
మతిపోయిన గతి సతతము క్షితిపై
వెతజెందునదే వ్యభిచారీ

2. చిత్తమంత తన యుత్తవారిపై
హత్తియుంచునదె సంసారీ
పెత్తనదారై యుత్తమాంమలను
మొత్తి ఏడ్చునదె వ్యభిచారీ.

3. భగవంతునిగన దగునియమముతో
జగమెరుంగునదే సంసారీ
తెగదిని మదమున సొగసులు చేయుచు
వగలుజూపునదె వ్యభిచారీ.

4. పరపురుషులగని పరువెరింగి కను
మరిగి తిరుగునదె సంసారీ
మురిపెముతో తన చరితంబితరుల
కెరిగించునదె వ్యభిచారీ.

5. సకలధర్మముల నికరమెరిగి పర
సుఖము గోరినదె సంసారీ
వికటసుఖముకై పకపకమని పం
డ్లికిలించునదె వ్యభిచారీ.

6. పరసతులకు నిహపర సౌఖ్యంబుల
గురిజూపినదె సంసారీ
ఇరుగు పొరుగులను జొరబడితిట్టెడి
వరుసలెరిగినదె వ్యభిచారీ.

7. పెద్దలసంగతి ముద్దుతోడ మది
కద్దుకొన్నదె సంసారీ
గద్దరిబుద్ధిని హద్దు దప్పిచెడు
విద్య గోరునదె వ్యభిచారీ.

8. కృష్ణంరాజున కిష్టమైన ఈ
సృష్టెరింగినదె సంసారీ
భ్రష్టతిండికై కష్టమోర్చి గతి
నష్టపెటునదె వ్యభిచారీ.

"విత్తమోహంబుతో దానమివ్వలేని
ధనికులను లోకమం దెందరినో జూతు
మరియు మరియు ద్రవ్యమునకై పరువు లిడెడి
లోభులన దెందరి నొగందు లోకమందు"

"ప్రభువులేగిరమాత్యులం ప్రళయమైరి
చిన్న పెద్ద సమస్తంబు జీర్ణమయ్యె
కటకటా యెవ్వనికిగాని కామములను
తృప్తియనునది లోకాన దొరక లేదు."

"పోయె మావాడు మానాన్న పోయెననుచు
మొత్తుకొందురో హోయని మోము లెత్తి
గుడ్డలంజుట్టి అల్లదే గొంచుపోయి
కాష్టమందిడి దయలేక కాల్చుచుండ్రు"

"ఉన్నదంతయు దాయాదులూడ్చుకొంద్రు
ఓరిజీవుడ నీది యెడారి దారి
దోవబత్తెంబు కట్టుకొన్నావొ లేదొ
చివర నీవెంటరాదొక్క చిల్లిగవ్వ" (బుద్ధచర్య

## పెద్దల పద్య రత్నములు

సీ. చెప్పనేటికి దానెంత శ్రేష్ఠుడైన
కృత శుభాశుభ కర్మముల్ వెంట గలడె !
కొంచమో గొప్పయో తాము గొలుపు కర్మ
మనుభవింతురు మనుజులు నమరవరులు॥

క. తన చేసిన కర్మముచే
దనకాపద సంభవింప దైవము దూరన్
జన దన్యుల నిందింపన్
జనదయ్యది యనుభవమున జక్కంబడెడిన్ ॥

గీ. తానొనర్చిన కర్మంబు తనకు గష్ట
మొసంగు తరి తెల్విగలవాడు వ్యసన పడడు
అన్యులపకారమును దనకాచరించి
రనుచునజ్ఞుండు వైరమ్మునగని కృశించు
( దేవీభా

సీ. సంసారమున జేరి చావజూతురుగాని
లక్ష్యముంచరు మహా లాభమునకు
పిచ్చి పట్టిన రీతి కుక్షి కేద్తురు గాని
లక్ష్యముంచరు మహా లాభమునకు
పలు దుఃఖములకోర్చి కులుకుచుందురు గాని
లక్ష్యముంచరు మహా లాభమునకు
తెగదిని మత్తెక్కి పొగరు గాంతురు గాని
లక్ష్యముంచరు మహా లాభమునకు

గీ. యిట్టి పలుగాకి మనుజులీ సృష్టియందు
హీనకర్మలు గుర్తించి మాన లేక
చెరుపుచున్నారు యోగముల్ జరుగనీక
రాజయోగీంద్ర లక్ష్మి నారాయణార్య ॥

సీ. తల్లిదండ్రులు నక్క చెల్లెండ్రు బావలు
నన్నదమ్ములు మోదమందుచెల్ల
నాలుబిడ్డలు సొంత యత్తమామలు సదా
యసమానురాగులై మసలుచెల్ల

సకలవిద్యలు మంచి సఖులు బంధుశ్రేణి
పశుధనంబులు గొప్ప వసతులెల్ల
జగతిపై స్థావర జంగమాదులతోడ
నిండి కన్పించు బ్రహ్మాండమెల్ల
గీ. కన్నుమూసినతోడనే సున్నయగుచు
మాయమైపోవు సంగతి మరచి సర్వ
పాపముల జేయుచుందురీ పాడునరులు
రాజయోగీంద్ర లక్ష్మీనారాయణార్య.
సీ. మొదట సంసారంబు మోసియేడ్చిన కుంత
తనయునిపై బెట్టి తల్లిపోయె
దానినాతడు మోసి మానక మరికొంత
గూర్చిపుత్రునకిచ్చి కూలిపోయె
నద్దాని ధరియించి హద్దుగానక మోసి
యతని పుత్రునకిచ్చి యడగిపోయె
నట్టి దానిని నాత డెట్టులో తెగమోసి
సతి సుతాదులకిచ్చి సమసిపోయె
గీ. బహుతరంబులనుండి యీ బాధ బొందు
చురిగి మానవులీ మాయ గురిధరించి
కూలుచున్నారు పరమాత్మ గుర్తుదప్పి
రాజయోగీంద్ర లక్ష్మీనారాయణార్య.
సీ. సూర్య చంద్రులు మాయ సృష్టి సర్వము మాయ
ధనధాన్యములు మాయ తనువుమాయ
అఖిల కర్మలుమాయ యవనీశ్వరులు మాయ
యుద్యోగములు మాయ విద్య మాయ

తల్లిదండ్రులు మాయ తగులాటములు మాయ
పనులన్నియును మాయ ఫలము మాయ
సర్వజీవులు మాయ సంసారమతి మాయ
సతి సుఖంబులు మాయ గతులు మాయ

గీ. దృశ్యకార్యంబులన్నియు దుఃఖమగుచు
మాయగాబోవు సంగతి మరచిపోవు
మానవుల జన్మమతి మాయ మాయ మాయ
రాజయోగీంద్ర లక్ష్మి నారాయణార్య॥

క. మంగళమా సద్గురునకు
మంగళమాత్మస్వరూప మహితాత్మునకున్
మంగళమా సర్వమునకు
మంగళమాత్మావలోక మహిమకు మనసా.

(తత్త్వలక్ష్మ్యార్ణవమునుం



# శ్రీ చిన్మయ రామదాసు గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ గీతాయోగ చతుష్టయము | రు. 0- |
| 2. | ఆచరణ - అనుభవము | 1- |
| 3. | జ్ఞానాగ్నికణములు | 0- |
| 4. | జీవితధర్మామృతము | 1- |
| 5. | గృహస్థధర్మావళి ( రెండవ కూర్పు ) | 1- |
| 6. | శ్రీ భగవత్పూజామాలా ( నాల్గవ కూర్పు ) | 2- |
| 7. | దేవుడెవరు ? ( దేవుడెట్లు కనబడును ? ) | 1- |
| 8. | ప్రశ్నోత్తర తారావళి | 0- |
| 9. | ప్రశ్నోత్తర తులసీమాల | 1- |
| 10. | జ్ఞానకథలు | 1- |
| 11. | క్రోధము - శాంతము | 0- |
| 12. | కైవల్యసాధని | 1- |
| 13. | క్లేశనివారిణి | 1- |
| 14. | సుఖము - దుఃఖము | 1- |
| 15. | పుణ్యము - పాపము * | |
| 16. | శ్రీ మళయాళసద్గురు చరిత్ర సార సంగ్రహము * | |

* ఈగుర్తు గలవి పునర్ముద్రణ కావలసి యున్నవి.

## అచ్చుకావలసిన గ్రంథములు

1. భక్తి - వైరాగ్యము
2. భక్తి - భగవంతుడు
3. జపము - ధ్యానము
4. చిన్మయసూక్తులు
5. ధర్మబోధావళి
6. గీతాప్రభావము
7. ధర్మసూక్తులు
8. శ్రీ మళయాళసద్గురు సుబోధసారము

శ్రీ మలయాళసద్గురు పెద్దాశ్రమః
తాడేపల్లి పోస్టు, వయా కొడాలి
దివితాలూకా, కృష్ణాజిల్లా